# గణేశ గీత

- శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రి



శ్రీరస్తు

# శ్రీగణేశగీత

శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రిగారిచే రచిం
ఆంధ్రానువాదసహితము.



చెన్నపురి:
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ
ప్రకటితము.

శ్రీరస్తు

# శ్రీ గణేశ గీత

## ప్రథమాధ్యాయము

### సాంఖ్యసారార్థయోగము

శ్లో. ఏవమేవ పురా పృష్టః శౌనకేన మహాత్మనా,
సనూతః కథయామాస గీతాం వ్యాసముఖాచ్ఛ్రితామ్. 1

తా. ఇవ్విధముగ పూర్వము మహాత్ముఁడగు శౌనకమహర్షిచేఁ బ్రశ్నింపఁబడిన యాసూతుఁడు వ్యాసముఖమునుండి తా వినిన గీతనుఁ జెప్పెను.

అష్టాదశపురాణోక్తమమృతం ప్రాశితం త్వయా,
తతోఽతిరసవత్పాతు మిచ్ఛామ్యమృతముత్తమమ్. 2

సూతుఁడు పలికెను:—నీచే పదునెనిమిదిపురాణములయందుఁ జెప్పఁబడిన యమృతము నేను దినిపింపఁబడితిని, వానికంటెను రసవంతమయిన శ్రేష్ఠమగునమృతము నిప్పుడు పానము జేయఁగోరుచున్నాను.

యేనామృతమయోభూత్వాపుమాన్ బ్రహ్మామృతంయతః,
యోగామృతంమహాభాగ తన్మేకరుణయా వద. 3

ఓమహాభాగా! ఏయమృతముచే పురుషుఁ డమృతమయుఁడుగనై యమృతస్వరూపమగు పరబ్రహ్మమగుచున్నాఁడో, అట్టి యోగామృతమును నాకొఱకు కరుణతోఁ, జెప్పుము

అథ గీతాం ప్రవక్ష్యామి యోగమార్గప్రకాశినీమ్,
నియుక్తా పృచ్ఛతే సూత రాజ్ఞే గజముఖేన యా. 4

వ్యాసుఁడు పలికెను:—సూతా! యోగమార్గమునుఁ బ్రతిపాదించు గీతను నీకుఁ జెప్పగలను. ఆగీత గణేశునిచేఁ దన్నుఁ బ్రశ్నించిన వరేణ్యరాజునకుఁ జెప్పఁబడినది.

విఘ్నేశ్వర మహాబాహో సర్వవిద్యావిశారద,
సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞ యోగం మే వక్తుమర్హసి. 5

వరేణ్యుఁడు పలికెను:—విఘ్నేశ్వరా! మహాబాహూ! సకలవిద్యల యందు నారితేఱినవాఁడా! సకలశాస్త్రములయొక్క రహస్యములఁ దెలిసిన వాఁడా! నాకొఱకు యోగముఁ జెప్పఁదగియున్నావు.

సమ్యగ్వ్యవసితా రాజన్ మతిస్తేఽనుగ్రహాన్మమ,
శృణు గీతాం ప్రవక్ష్యామి యోగామృతమయీం నృప. 6

శ్రీగణేశుఁడు పలికెను:—ఓరాజా! నాయనుగ్రహమువలన నీయొక్క బుద్ధి చక్కఁగా నిశ్చయము నొందియున్నది. ఓనృపా! యోగామృతస్వరూపమగు గీతనుఁ జెప్పఁగలను, వినుము.

న యోగం యోగమిత్యాహుర్యోగో యోగో న చ శ్రియః,
న యోగో విషయైర్యోగో న చ మాత్రాదిభిస్తథా. 7

సంయోగమునుయోగ మని చెప్పరు. లక్ష్మీయోగమును యోగము కాదు. రూపాధివిషయములతో యోగమును యోగముకాదు. తల్లి మున్నగువారితోఁటి సంబంధమును యోగముగాదు.

యోగో యః పితృమాత్రాదేర్న స యోగో నరాధిప,
యో యోగో బంధుపుత్రాదేర్యశాష్టభూతిభిః సహ. 8

ఓరాజా! తల్లిదండ్రులు మున్నగుబంధువులతోడి సంబంధమును యోగము కాదు. బంధుపుత్రాదులతోడి సంబంధమును, అష్టైశ్వర్యములతోటి సంబంధమును యోగముగాదు.

న స యోగస్త్రియా యోగో జగదద్భుతరూపయా,
రాజ్యయోగశ్చ నో యోగో న యోగో గజవాజిభిః. 9

లోకమునం దన్నిటికంటెను నద్భుతమగు శక్తిగలస్త్రీతో సంబంధమును యోగముకాదు. రాజ్యముతోడిసంబంధము యోగముకాదు. గజాశ్వాదులతోటి సంబంధమును యోగముకాదు.

యోగో నేన్ద్రపదస్యాపి యోగో యోగార్థినః ప్రియః,
యోగో యః సత్యలోకస్య న స యోగో మతో మమ. 10

యోగము గోరువానికి ప్రియమయిన ఇంద్రపదవియొక్కసంబంధమును యోగముకాదు. సత్యలోకముయొక్క సంబంధమును యోగము కాదని యభిప్రాయము.

శైవస్య యోగో నో యోగో వైష్ణవస్య పదస్య యః,
న యోగో భూప సూర్యత్వం చంద్రత్వం న కుబేరతా. 11

శివునిస్థానమును బొందుటయు యోగముకాదు. విష్ణువుయొక్క స్థానముం బొందుటయు యోగముకాదు. ఓరాజా! సూర్యుఁడగుటయు యోగముకాదు. చంద్రుఁడగుటయు యోగముకాదు. కుబేరుఁడగుటయు యోగముకాదు.

నానిలత్వం నానలత్వం నామరత్వం న కాలతా,
నవారుణ్యం న నైఋత్యం న యోగంసార్వభౌమతా. 12

వాయువగుటయు యోగముకాదు. అగ్నియగుటయు యోగముకాదు. అమరుఁడగుటయు యోగముకాదు. యముఁడగుటయు యోగముకాదు. వరుణుఁడగుటయు యోగముకాదు. నిర్ఋతియగుటయు యోగముకాదు. చక్రవర్తియగుటయు యోగముకాదు.

యోగం నానావిధం భూప యుంజంతి జ్ఞానినస్తతమ్,
భవంతి వితృషా లోకే జితాహారా విరేతసః. 13

ఓరాజా! జ్ఞానులు పలుతెఱంగులును, విస్తృతమునగు యోగము నను ష్ఠించుచున్నారు. లోకమునందు ఆహారమును జయించి రేతశ్శక్తిని నిగ్రహించు కొనినవారు కోరికలులేనివా రగుదురు.

పావయంత్యఖిలాంల్లోకాఞ్ వశీకృతజగత్త్రయాః,
కరుణాపూర్ణహృదయా బోధయంత్యపి కాంశ్చన. 14

వారు ముల్లోకములను వశముఁగావించుకొనినవారై; లోకముల నన్నిం టిని పవిత్రములుగఁ జేయుదురు. వారు దయతో నింపఁబడినమనస్సుగలవారై యితరులను సైతము బోధింతురు.

జీవన్ముక్తాహ్రదే మగ్నాః పరమానందరూపిణి,
నిమీల్యాక్షీణి పశ్యంతః పరం బ్రహ్మ హృది స్థితమ్. 15

వారు జీవించియు మోక్షముఁబడసినవారై, పరమానందస్వరూపమగు కొలనియందు మునింగినవారై, కన్నులను మూసికొనియు హృదయమందలి పర మాత్మనుఁ జూచుచున్నవారై,

ధ్యాయంతః పరమం బ్రహ్మ చిత్తే యోగవశీకృతమ్,
భూతాని స్వాత్మనా తుల్యం సర్వాణి గణయంతి తే. 16

యోగముచే స్వాధీనమయిన పరబ్రహ్మమును చిత్తమందు ధ్యానించు చున్నవారై, సకలభూతములను తమతో సమానముగ వారు గణించుచున్నారు.

యేన కేనచిదాచ్ఛిన్నా యేన కేనచిదాహతాః,
యేన కేనచిదాకృష్టా యేన కేనచిదాశ్రితాః. 17

వారు దేనిచేతను భేదింపఁబడనివారై, దేనిచేతను కొట్టఁబడనివారై, దేని చేతను నాకర్షింపఁబడనివారై, దేనిచేతను నాశ్రయింపఁబడనివారై,

కరుణాపూర్ణహృదయా భ్రమంతి ధరణీతలే,
అనుగ్రహాయ లోకానాం జితక్రోధా జితేంద్రియాః. 18

కరుణతో నింపఁబడినహృదయముగలవారై, క్రోధమును జయించిన వారై, ఇంద్రియములను నిగ్రహించినవారై జనుల ననుగ్రహించుటకొఱకు భూతలమునందుఁ దిరుగుచున్నారు.

దేహమాత్రభృతో భూప సమలోష్టాశ్మకాంచనాః,
ఏతాదృశా మహాభాగ్యాత్ స్యుశ్చక్షుర్గోచరాః ప్రియ.19

ఓరాజా ! వారు దేహమును కేవలము ధరించినవారై, మంటియందును, ఱాతియందును, బంగారమునందును సమానబుద్ధిగలవారై యున్నారు. ఓప్రియమైనవాఁడా! ఇట్టివారు గొప్పభాగ్యముచేతనే కంటికి గోచరింతురు.

తమిదానీమహం వక్ష్యే శృణు యోగమనుత్తమమ్,
శ్రుత్వాయం ముచ్యతే జంతుః పాపేభ్యో భవసాగరాత్.20

ఇప్పు డత్యుత్తమమైన యాయోగమునుఁ జెప్పఁగలను. వినుము. దానిని విని పాపములనుండియు, సంసారసముద్రమునుండియు జంతువు విముక్తిఁ బడయును.

శివే విష్ణౌ చ శక్తౌ చ సూర్యే మయి నరాధిప,
యా భేదబుద్ధిర్యోగః స సమ్యగ్యోగో మతో మమ. 21

ఓరాజా! శివునియందును, విష్ణువునందును, శక్తియందును, సూర్యుని యందును, నాయందును నభేదబుద్ధియే యుత్తమమైన యోగ మని నాయభిప్రాయము.

అహమేవ జగద్యస్మాత్ సృజామి పాలయామి చ,
కృత్వా నానావిధం వేషం సంహరామి స్వలీలయా. 22

నేను నాలీలచేఁ బెక్కుతెఱంగులగు వేషములనుఁ దాల్చి భూమిని సృజించుచున్నాను; పాలించుచున్నాను; సంహరించుచున్నాను.

అహమేవ మహావిష్ణు రహమేవ సదాశివః,
అహమేవ మహాశక్తి రహమేవార్యమా ప్రియ. 23

ఓ ప్రియుఁడైనవాఁడా! నేనే మహావిష్ణువను, నేనేసదాశివుఁడను, నేనే మహాశక్తిని, నేనే సూర్యుఁడను.

అహమేకో నృణాం నాథో జాతః పంచవిధః పురా,
అజ్ఞానాన్మాం న జానంతి జగత్కారణకారణమ్. 24

నేను స్వభావముచే నొక్కఁడయ్యు, తొల్లి యైదువిధములుగ ననఁగా పంచభూతాదివికారములుగలవాఁడుగనై మనుష్యులకు పాలకుఁడనైతిని. జగత్కారణమునకే కారణమయిన నన్ను నజ్ఞానమువలన జనులు తెలిసికొనుటలేదు.

మత్తోఽగ్నిరాపో ధరణీ మత్తఆకాశమారుతౌ,
బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ లోకపాలా దిశో దశ. 25

నావలననే యగ్నియు నుదకములు భూమియు నేర్పడినవి. నావలననే యాకాశము, వాయువు, బ్రహ్మ, విష్ణు, రుద్రులు, లోకపాలకులు, దశదిశలు;

వసవో మునయో గావో మనవః పశవోపిచ,
సరితః సాగరా యక్షా వృక్షాః పక్షిగణా అపి. 26

అష్టవసువులు, చతుర్దశమనువులు, గోవులు, మునులు, పశువులు, నదులు, సముద్రములు, యక్షులు, వృక్షములు, పక్షిగణములు;

తథైకవింశతిః స్వర్గా నాగాః సప్త వనాని చ,
మనుష్యాః పర్వతాః సాధ్యాః సిద్ధా రక్షోగణాస్తథా. 27

ఇరువదియొకటిస్వర్గములు, ఏడునాగలోకములు, వనములు, మనుష్యులు, పర్వతములు, సాధ్యులు, సిద్ధులు, రక్షోగణములు, సంభవించినవి.

అహం సాక్షీ జగచ్చక్షు రలిప్తః సర్వకర్మభిః,
అవికారోఽప్రమేయోఽహ మవ్యక్తో విశ్వగోఽవ్యయః. 28

నేను ప్రపంచమునకు నేత్రము కాన సర్వమును జూచువాఁడను. నేను సకలకర్మలచే నంటఁబడను. నేను వికారములేనివాఁడను; కొలువ శక్యముకాని

వాఁడను; వ్యక్తముకానివాఁడను; విశ్వమును వ్యాపించినవాఁడను; నాశములేని వాఁడను.

అహమేవ పరం బ్రహ్మాఽవ్యయానందాత్మకం నృప,
మోహయత్యఖిలాన్మాయా శ్రేష్ఠాన్మమ నరానమూన్. 29

ఓరాజా! శాశ్వతానందస్వరూపమగు పరబ్రహ్మము నేనే. నాయొక్క మాయ యుత్తములగు మానవులనందఱినిగూడ మోహింపఁజేయుచున్నది.

సర్వదా షడ్వికారేషు తాని యం యోజయేద్భృశమ్,
హిత్వా జాపటలం జంతు రనేకైర్జన్మభిః శనైః. 30

ఆమాయ వారిని చక్కఁగ షడ్వికారములయందును సంబంధింపఁజేయుచున్నది. పెక్కుజన్మములచే మెల్లగా ప్రాణిసంసారమును వదలి;

విరజ్య విందతి బ్రహ్మ విషయేషు సుబోధతః,
అచ్ఛేద్యం శస్త్రసంఘాతై రదాహ్యమనలేన చ. 31

బాగుగ జ్ఞాన మేర్పడుటవలన రూపాదివిషయములయందు విముక్తిఁ బొంది పరబ్రహ్మముఁబొందుచున్నది. అప్పుడా జంతువు శస్త్రములయొక్క దెబ్బలచే ఛేదింప శక్యముకాదు. అగ్నిచే దహింప శక్యముకాదు.

అక్లేద్యం భూప భువనై రశోష్యం మారుతేన చ,
అవధ్యం వధ్యమానేపి శరీరేస్మిన్నరాధిప. 32

ఓరాజా! అట్టిజంతువు ఉదకములచే క్లేదమును బొందదు; గాలిచే నెండదు. ఈదేహము వధింపఁబడుచున్నను ఆజంతువు వధింపఁబడదు.

యామి మాం పుష్పితాం వాచం ప్రశంసంతి శ్రుతీరితామ్,
త్రయీవాదరతా మూఢా స్తతోఽన్యన్నన్యతేఽపి న. 33

పుష్పములతో శోభించువృక్షమువలె పైకి మనోహరమయిన కర్మకాండాశ్రయమయిన వచనమును వేదపాఠమునం దాసక్తిగల్గిన మూఢులు చెప్పుచున్నారు. వారు దానికంటెను వేఱయినది లేదనియు తలంచుచున్నారు.

కుర్వంతి సతతం కర్మ జన్మమృత్యుఫలప్రదమ్,
స్వర్గైశ్వర్యరతా ధ్వస్త చేతనాభోగబుద్ధయః. 34

స్వర్గైశ్వర్యమునందాశగలవారై, భోగబుద్ధిగలవారై, నశించిన చైతన్యముగలవారై, జననమరణముల నొసంగుకర్మము వా రెల్లప్పుడును చేయుచున్నారు.

సంపాదయంతి తే భూప స్వాత్మనా నిజబంధనమ్,
సంసారచక్రం యుంజంతి జడాః కర్మపరా నరాః. 35

ఓరాజా! వారు తమయంతటతామే తమకు బంధమును సంపాదించుకొనుచున్నారు. ఇట్లు కర్మపరులయిన మూఢులగుజనులు సంసారచక్రమునందు తగుల్కొనుచున్నారు.

యస్యయద్విహితం కర్మ తత్కర్తవ్యం మదర్పణమ్,
తతోఽస్య కర్మబీజానా ముచ్ఛిన్నాః స్యుర్మహాంకురాః. 36

ఎవని కేకర్మము వేదముచే విధింపఁబడినదో, యతఁడాకర్మమును నాకర్పింపవలయును. దానివలన కర్మ మనెడివిత్తనముచే నేర్పడు సంసారమనెడి మహావృక్షములు తెగ ద్రేయఁబడుచున్నవి.

చిత్తశుద్ధిశ్చమహతీ విజ్ఞానసాధికా భవేత్,
విజ్ఞానేన హి విజ్ఞాతం పరం బ్రహ్మ మునీశ్వరైః. 37

మనశ్శుద్ధి విజ్ఞానమునకు గొప్పసాధనము. విజ్ఞానముచేతనే మునీశ్వరులచే పరబ్రహ్మము తెలియఁబడినది.

తస్మాత్కర్మాణి కుర్వీత బుద్ధియుక్తో నరాధిప,
న త్వకర్మా భవేత్కోఽపి స్వధర్మత్యాగవాంస్తథా. 38

ఓరాజా! అందువలన బుద్ధిమంతుఁడు కర్మముల నాచరింపవలయును. ఎవ్వఁడును కర్మమును విడచియుండఁడు. అవ్విధముగ కర్మమునుఁ బరిత్యజించినవాఁడు స్వధర్మమునే పరిత్యజించినవాఁడగును.

జహాతి యది కర్మాణి తతః సిద్ధిం న విందతి,
ఆదౌ జ్ఞానే నాధికారః కర్మణ్యేవ సయుజ్యతే. 39

కర్మములను విడచినందువలననే సిద్ధి నెవ్వడునుఁ బొందఁడు. మొదట జ్ఞానమం దధికారము తగదు. కర్మయందే మొదట నధికారము తగినది.

కర్మణా శుద్ధహృదయోఽభేదబుద్ధిముపైష్యతి,
స చ యోగః సమాఖ్యాతోఽమృతత్వాయ హి కల్పతే.40

కర్మముచేఁ బరిశుద్ధమయినమనస్సుగలవాఁడు అభేదబుద్ధినిఁ బొందఁగలఁడు. అదియే యోగ మని చెప్పఁబడును. అదియే మోక్షమునకు సాధన మగుచున్నది.

యోగమన్యం ప్రవక్ష్యామి శృణు భూప తముత్తమమ్,
పశౌ పుత్రే తథా మిత్రే శత్రౌ బంధౌ సుహృజ్జనే. 41

ఓరాజా! ఉత్తమమగు మఱియొకయోగమును జెప్పఁగలను. దానిని వినుము. పశువునందును, పుత్రునియందును, మిత్రునియందును, శత్రునియందును, బంధువునందును, సుహృజ్జనమునందును,

బహిర్దృష్ట్యా చ సమయా హృత్స్థయా లోకయేత్పుమాన్,
సుఖే దుఃఖే తథాఽమర్షే హర్షే భీతౌ సమో భవేత్. 42

హృదయమునం దుద్భవించిన సమమగుబాహ్యదృష్టిచే పురుషుఁడు చూడవలయును. సుఖమునందును, దుఃఖమునందును, క్రోధమునందును, హర్షమునందును, భయమునందును సముఁడుగ నుండవలయును.

రోగాప్తౌ చైవ భోగాప్తౌ వా జయే విజయేఽపిచ,
శ్రియోఽయోగే చ యోగే చ లాభాలాభే మృతావపి.

రోగము సంభవించినను, భయము సంభవించినను, జయము సంభవించినను, పరాజయము సంభవించినను, లక్ష్మి ప్రాప్తించినను, ప్రాప్తింపకపోయినను, లాభమునందును, నష్టమునందును, మరణమునందును,

సమో మాం వస్తుజాతేషు పశ్యన్నంతర్బహిః స్థితమ్,
సూర్యే సోమే జలే వహ్నౌ శివే శక్తౌ తథానిలే. 44

సముఁడై వర్తించువాఁడును, అన్నివస్తువులయందును లోపల వెలుపల నున్నవానినిగ నన్నుఁ జూచువాఁడును, మఱియు సూర్యునియందును, చంద్రుని యందును, జలమునందును, అగ్నియందును, శివునియందును, శక్తియందును, వాయువునందును;

ద్విజే హ్రది మహానద్యాం తీర్థే క్షేత్రేఽఘనాశిని,
విష్ణౌ చ సర్వదేవేషు తథా యక్షోరగేషు చ. 45

ద్విజునియందును, హృదయమునందును, మహానదియందును, పాపమును హరించుతీర్థమునందును, క్షేత్రమునందును, విష్ణువునందును, సమస్తదేవతలయందును, యక్షులయందును, నాగులయందును;

గంధర్వేషు మనుష్యేషు తథా తిర్యగ్భవేషు చ,
సతతం మాం హి యః పశ్యేత్సోఽయం యోగవిదుచ్యతే.

గంధర్వులయందును, మనుష్యులయందును, తిర్యగ్జంతువులయిన పశుపక్ష్యాదులయందును ఎల్లప్పుడు నెవ్వఁడు నన్నుఁ గాంచునో యతఁడే యోగముఁ దెలిసినవాఁడు.

సంపరాహృత్య స్వార్థేభ్య ఇంద్రియాణి వివేకతః,
సర్వత్ర సమతాబుద్ధిః స యోగో భూప మే మతః. 47

ఓరాజా! వివేకమువలన నింద్రియములను విషయములనుండి మరలిచ్చి యంతట సమబుద్ధిని నెఱపుటయే యోగ మని నాయభిప్రాయము.

ఆత్మానాత్మవివేకేన యా బుద్ధిర్దేవయోగతః,
స్వధర్మాసక్తచిత్తస్య తద్యోగో యోగ ఉచ్యతే. 48

తనకులధర్మములయం దాసక్తమయిన మనస్సుగలవానికి దైవయోగమువలన నాత్మను, నాత్మకంటె భిన్నమయినజడములను వేఱ్వేఱుగ గ్రహింపఁగల బుద్ధిని గల్గియుండుటయే యోగ మనఁబడుచున్నది.

ధర్మాధర్మౌ జహాతీహ తయాయుక్త ఉభావపి,
అతో యోగాయ యుంజీత యోగో వై ధేషు కౌశలమ్.

అట్టి తత్త్వజ్ఞానముతోఁగూడినపురుషుఁ డిచ్చటనే ధర్మాధర్మములను రెంటినిఁ బరిత్యజించును. కాన మోక్షకాముఁడు యోగమునకై ప్రయత్నింపవలయును. విధ్యుక్తకర్మల నాచరింపగలనేర్పే యోగ మనఁబడుచున్నది.

ధర్మాధర్మఫలే త్యక్త్వా మనీషీ విజితేంద్రియః,
జన్మబంధవినిర్ముక్తః స్థానం సంయాత్యనామయమ్. 50

బుద్ధిమంతుఁ డింద్రియములను జయించినవాఁడై, ధర్మాధర్మములయొక్క ఫలములను వదలి జన్మబంధమునుండి విముక్తిఁబడసినవాఁడై రోగరహితమయిన స్థానమును అనఁగా పరమపదమును బొందును.

యదాహ్యజ్ఞానకాలుష్యం జంతోర్బుద్ధిః క్రమిష్యతి,
తదాసౌ యాతి వైరాగ్యం వేదవాక్యాదిషు క్రమాత్. 51

ఎప్పుడు జీవునియొక్క బుద్ధి యజ్ఞానమాలిన్యము నతిక్రమించునో యప్పుడు వేదవాక్యాదులయందు క్రమముగా వైరాగ్యమునుఁ బొందును.

త్రయీ విప్రతిపన్నస్య స్థాణుత్వం యాస్యతే యదా,
పరాత్మన్యచలాబుద్ధి స్తదాసౌ యోగమాప్నుయాత్. 52

ఋగ్యజుస్సామలనెడి మూఁడు వేదములయందు విరోధబుద్ధినిపొందినవాని కెప్పుడు పరమాత్మయందు నిశ్చలబుద్ధి యేర్పడునో అప్పు డాతఁడు యోగముఁబడయును.

మానసానఖిలాన్ కామా న్యథాధీమాన్ స్త్యజేత్ప్రియ,
స్వాత్మని స్వేన సంతుష్టః స్థిరబుద్ధి స్తదోచ్యతే. 53

ఓప్రియమైనవాఁడా! బుద్ధిమంతుఁడు మానసికములయిన సమస్తవాంఛలనువదలి తనయందు తనచేతనే సంతసమందియుండునో యతఁడే స్థిరబుద్ధి యనఁబడును.

విత్రృష్ణా సర్వసౌఖ్యేషు నోద్విగ్నో దుఃఖసంగమే,
గతసాధ్వ సరుద్రాగః స్థిర బుద్ధి స్తదోచ్యతే. 54

సమస్తసుఖములందును నాశలేనివాఁడును, దుఃఖముసంభవించినను దుఃఖముఁజెందనివాఁడును, భయరోషరాగములు లేనివాఁడును నై మెలంగు వాఁడు స్థిరబుద్ధి యనఁబడును.

యథాఽయం కమఠోఽంగాని సంకోచయతి సర్వతః,
విషయేభ్య స్తథా ఖాని సంకర్షేద్యోగతత్పరః. 55

కూర్మము వెలుపలనుండి తనయంగములను లోనికి సంకోచముఁజేయు నట్లు యోగి తనయింద్రియములను విషయములనుండి మరలింపవలయును.

వ్యావర్తంతేఽస్య విషయా స్త్యక్తాహారస్య వర్ష్మిణః,
వినా రాగం చ రాగోఽపి దృష్ట్వా బ్రహ్మ వినశ్యతి. 56

ఆహారమును వర్జించినదేహికి రూపాదివిషయములు తమయంతటనే నివృత్తిఁ జెందుచున్నవి. కాని యారూపాదివిషయములయందు ప్రీతిమాత్రము నివృత్తముగాదు. ఆప్రీతియుపరబ్రహ్మమును దర్శింపఁగనే నశించును.

విపశ్చిద్యతతే భూప స్థితిమాసాద్య యోగినః,
మంథయిత్వేంద్రియాణ్యస్య హరన్తి బలతో మనః. 57

ఓరాజా! జ్ఞాని, మనస్సును బలముతో నాకర్షించునింద్రియములను మథించి యనఁగా నిగ్రహించి, యోగియొక్కస్థితినిఁ బొంది మోక్షమునకై యత్నించును.

యుక్తస్తాని వశీకృత్వా సర్వదా మత్పరో భవేత్,
సంయతానీంద్రియాణీహ యస్యాసౌ కృతధీర్మతః. 58

అట్లు యోగయుక్తుఁడయిన జ్ఞానియాయింద్రియములను వశమందుంచు కొని యెల్లప్పుడును నాయందే యాసక్తిగల్గియుండవలయును. ఈదేహమునం

జెవని యింద్రియములు నిగ్రహింపఁబడునో ఆతఁడే జ్ఞానసంపన్నుఁ డనఁబడును.

చింతయానస్య విషయాన్ సంగస్తేషూపజాయతే,
కామః సంజాయతే తస్మాత్ తతః క్రోధోఽభివర్ధతే. 59

రూపాదివిషయములను చింతించుచుండువాని కావిషయములయందు సంబంధ మేర్పడును. ఆవిషయసంబంధమువలన కామము జనించును; కామమువలన క్రోధ ముద్భవించును.

క్రోధాదజ్ఞానసంభూతిర్ విభ్రమస్తు తతః స్మృతేః,
భ్రంశాత్స్మృతేర్మతేర్ధ్వంస స్తద్ధం సాత్సోఽపి నశ్యతి. 60

క్రోధమువలన జ్ఞానము నశించును. జ్ఞానము నశించుటవలన స్మృతికి వినాశ మేర్పడును. స్మృతి నశించుటవలన మతి నశించును. మతి నశించుటవలన నాతఁడును నశించును.

వినా ద్వేషం చ రాగం చ గోచరానింద్రియైశ్చరేత్,
స్వాధీనహృదయో వశ్యైః సంతోషం స సమృచ్ఛతి. 61

రాగద్వేషములులేక యింద్రియగోచరములగు విషయములతో సంగము జేయువాఁడు, వశ్యములైన యింద్రియములచే మనస్సునుగూడ తనయధీనమునం దుంచుకొనినవాఁడై సంతోష మనుభవించును.

త్రివిధస్యాపి దుఃఖస్య సంతోషే విలయో భవేత్,
ప్రజ్ఞయా సుస్థితశ్చాయం ప్రసన్నహృదయో భవేత్. 62

ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికములను మూఁడు తెఱంగులుగల దుఃఖములును సంతోషమునందే లయముఁబొందుచున్నవి. తనప్రజ్ఞచే నింద్రియములను వశముఁగావించికొని యుండినజ్ఞాని నిర్మలహృదయుఁడై యుండును.

వినా ప్రసాదం నమతిః వినా మత్యా న భావనా,
వినా తాం న శమో భూప వినా తేన కుతః సుఖమ్. 63

ఓరాజా! మనోనైర్మల్యము లేనిచో బుద్ధియుండదు; బుద్ధియుండని యెడల భావన యుండదు; భావనలేనిచో శాంతియుండదు; శాంతిలేనిచో సుఖ ముండదు.

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే, (ఇంద్రియాశ్వాన్విచరతో విషయా ననువర్తతే,)
యన్మనస్తన్మతిం హన్యా దప్సు నావం మరుద్యథా. 64

విషయముల ననుసరించి సంచరించుచుండు చక్షురాదీంద్రియములను గుఱ్ఱములను మనస్సు వెంబడించుచున్నది. కావున వాయువు, జలమునందలి యోడనుఁగొట్టునట్లు మనస్సునుఁ గొట్టవలయును. అనగా నిగ్రహింపవలయును.

యారాత్రిః సర్వభూతానాం తస్యాం నిద్రాతి నైవ సః,
న స్వపంతీహ తే యత్ర సా రాత్రిస్తస్య భూమిప. 65

ఓరాజా! ఏది సర్వభూతములకును రాత్రియో దానియందు జ్ఞాని నిదురింపఁడు. ఆభూతము లెప్పుడు నిద్రింపవో, ఆకాలమే యాయోగికి రాత్రి యగుచున్నది.

సరితాం పతిమాయాంతి వనాని సర్వతో యథా,
ఆయాంతి యం తథా కామా నసశాంతిక్వచిల్లభేత్. 66

సమస్తదిక్కులనుండియు ప్రవహించునుదకములు సముద్రమునుఁ బొందున ట్లెవ్వనిసకలకామములునుఁ జేరుచుండునో యాతఁ డొకప్పుడును శాంతినిఁ బొందఁజాలఁడు.

అతస్తానీహ సంరుధ్య సర్వతః ఖాని మానవః,
స్వస్వార్థేభ్యః ప్రధావంతి బుద్ధిరస్య స్థిరా తదా. 67

కావున నట్టికామములకు కారణములయిన విషయాభిముఖములుగ బరుగెత్తునింద్రియములను మానవుడు నిరోధింపవలయును. అప్పు డితనికి స్థిరమయిన బుద్ధి యేర్పడఁగలదు.

మమతాహంకృతీ త్యక్త్వా సర్వాన్ కామాంశ్చ యస్త్యజేత్,
నిత్యం జ్ఞానరతో భూత్వా జ్ఞానాన్ముక్తిం స యాస్యతి. 68

ఎవఁడు మమకారాహంకారములను విడచి సకలకామములనుఁ బరిత్యజించునో, అట్టివాఁడు నిత్యము జ్ఞానమునందే యనురక్తిగలవాఁడై యాజ్ఞానమువలనఁ జివర ముక్తినిఁ బడయును.

ఏవం బ్రహ్మధియం భూప యో విజానాతి దైవతః,
తుర్యామవస్థాం ప్రాప్యాపి జీవన్ముక్తిం ప్రయాస్యతి. 69

ఓరాజా! ఎవ్వఁడు సుకృతవశముచే నిట్లు బ్రహ్మజ్ఞానముఁగూర్చి తెలిసికొనుచున్నాఁడో, యాతఁడు చతుర్థావస్థను పొందియు జీవన్ముక్తినిఁ బడయఁగలఁడు.

శ్రీగణేశపురాణోత్తరఖండాన్తర్గతమును యోగామృతార్థశాస్త్రమును ఉపనిషదర్థగర్భమునుఅగు శ్రీమద్గణేశగీతయందు శ్రీగజాననవరేణ్యసంవాదమున సాంఖ్యసారార్థాయోగమనెడి ప్రథమాధ్యాయము.

---

శ్రీరస్తు

# శ్రీగణేశగీత

## ద్వితీయాధ్యాయము



### కర్మయోగము

జ్ఞాననిష్ఠా కర్మనిష్ఠా ద్వయం ప్రోక్తమ్ త్వయా విభో,
అవధార్య వదైకం మే నిఃశ్రేయసకరం ను కిమ్? 1

వరేణ్యుఁడు పలికెను:—ఓవ్యాపకుఁడా! నీచే జ్ఞాననిష్ఠ యనియు కర్మనిష్ఠ యనియు రెండుమార్గములు చెప్పఁబడినవి. వానిలో నేది శ్రేయస్కరమో దానిని నాకు నిశ్చయించి చెప్పుము.

అస్మిన్ చరాచరే స్థిత్యై పురోక్తే ద్వే మయా ప్రియ,
సాంఖ్యానాం బుద్ధియోగేన వైథయోగేన కర్మణామ్. 2

శ్రీగజాననుఁడు పలికెను:—ఓప్రియమైనవాఁడా! పూర్వము నాచేఁ జెప్పఁబడిన యోగములు రెండును నీచరాచరరూపప్రపంచముయొక్క స్థితి ననుసరించియే చెప్పఁబడినవి. అందు బుద్ధియోగము సాంఖ్యులకును, కర్మయోగము కర్ములకు నాచరణీయములు.

అనారంభేణ వైధానాం నిష్క్రియః పురుషో భవేత్,
న సిద్ధిం యాతి సంత్యాగాత్ కేవలాత్కర్మణో నృప. 3

ఓరాజా! విధ్యుక్తములగుకర్మముల నారంభింపకయుండుటచేత పురుషుఁడు కర్మరహితుఁ డగును. కేవల కర్మత్యాగమువలన సిద్ధిని బొందఁడు.

కదాచిదక్రియః కోఽపి క్షణం నైవావతిష్ఠతే,
అస్వాతంత్రః ప్రకృతిజై ర్గుణైః కర్మ చ కార్యతే. 4

ఎవ్వఁడును నొకప్పుడును కర్మమును చేయకయుండనేరఁడు. కర్మములను చేయుటయందు స్వాతంత్ర్యములేనివాఁడైనను పురుషుఁడు పుణ్యాపాపములచే నేర్పడుగుణములచేతనే పురికొల్పఁబడి కర్మములను చేయును.

కర్మకారింద్రియగ్రామం నియమ్యాస్తే స్మరన్పుమాన్,
తద్గోచరాన్మందచిత్తో ధిగాచారః స భాష్యతే. 5

కర్మను చేయుపురుషుఁడు ఇంద్రియసమూహమును నియమించి ఇంద్రియములయందు విషయములగురూపాదులను స్మరించుచు నున్నాఁడు. అట్టి మందమగుచిత్తప్రవృత్తిగలపురుషుఁడు హీనాచారుఁడుగఁ జెప్పఁబడుచున్నాఁడు.

తద్గ్రామం సం నియమ్యాదౌ మనసా కర్మ చారభేత్,
ఇంద్రియైః కర్మయోగం యో విత్రృష్ణః స పరో నృప. 6

ఓరాజా! ఆయింద్రియసమూహమును మొదట మనస్సుతో నియమించి యింద్రియములచే నిష్కామముగ కర్మయోగముగలవాఁడు ఉత్కృష్టుఁడగుచున్నాఁడు.

అకర్మణః శ్రేష్ఠతమం కర్మానీహ కృతం తు యత్,
వర్ష్మణః స్థితిరప్యస్యా కర్మణో నైవ సేత్స్యతి. 7

కర్మ లేకయుండుటకంటెను, ఫలాపేక్ష లేక కర్మనుఁ జేయుంట మిక్కిలి శ్రేష్ఠము. కర్మములేనివానికి దేహముయొక్క యునికియు సమర్థింప శక్యము గాదు.

అసమర్ప్యనిబధ్యన్తే కర్మతేన జనా మయి,
కుర్వీత సతతం కర్మా నాశోఽసంగో మదర్పణమ్. 8

తాము చేయుకర్మములను పరమాత్మయగు నాకర్పింపనిజనులు సంసారముచే బంధింపఁబడుచున్నారు. కాన నెల్లప్పుడు ఫలాపేక్షను వదలి కర్మఫలముతో నెట్టిసంబంధము నుంచుకొనక కర్మములను నాకర్పింపవలయును.

మదర్థే యాని కర్మాణి తాని బధ్నంతి న క్వచిత్,
సవాసనమిదం కర్మ బధ్నాతి దేహినం బలాత్. 9

నన్ను నుద్దేశించి చేయుకర్మము లేవియు, నెవ్వరిని నెప్పుడును బంధింపవు. ఫలాదిరూపము లగు వాసనలతోఁగూడినకర్మయే దేహిని బంధించుచున్నది.

వర్ణాన్ సృష్ట్వా వదంచాహం సయజ్ఞాంస్తాన్పురా ప్రియ,
యజ్ఞేన ఋధ్యతామేష కామదః కల్పవృక్షవత్. 10

ఓ ప్రియమైనవాఁడా! నేను బ్రాహ్మణాదివర్ణములను సృజించితిని. యజ్ఞముఁజేయు నావర్ణస్థులతో, "యజ్ఞముచే కల్పవృక్షమువలె సకలఫలము నిచ్చు నీభగవంతుని సంతృప్తిఁబొందింపుడ"ని చెప్పితిని.

సురాంశ్చాన్నేన ప్రీణధ్వం సురాస్తే ప్రీణయంతు వః
లభధ్వం పరమం స్థాన మన్యోన్యప్రీణనాత్ స్థిరమ్. 11

మీరు దేవతల నన్నముచేఁ దృప్తిఁబొందింపుఁడు. ఆదేవతలును వర్షాదులొసంగుటచే మిమ్ములనుఁ దృప్తిఁబొందింతురుగాక. ఇటుల నొండొరుల నొండొరులు దృప్తిఁబొందించుటచే, పరమై, శాశ్వతమై వెలయుస్థానమునుఁ బొందుఁడు.

ఇష్టా దేవాః ప్రదాస్యన్తి భోగానిష్టాన్సుతర్పితాః,
తైర్దత్తాంస్తాన్న రస్తేభ్యోఽదత్త్వా భుంక్తే స తస్కరః. 12

ఇష్టదేవతలు సంతృప్తిఁజెందినవారలై, యిష్టములయినభోగముల నీయఁగలరు. ఏమనుష్యుఁడు వారిచే నొసంగఁబడినయన్నాదులను వారికి నివేదింపక భుజించుచున్నాఁడో వాఁడు చోరుఁడు.

హుతావశిష్టభోక్తారో ముక్తాః స్యుః సర్వపాతకైః,
అదంత్యేనో మహాపాపా ఆత్మహేతోః పచన్తి యే. 13

దేవతలకొఱకు హోమము గావించఁగా మిగిలినద్రవ్యము హుతావశేష మనఁబడును. దానిని భుజించువారు సమస్తపాతకములనుండి విముక్తినిఁ బడయుదురు. తమకొఱకుమాత్రమే వంటఁజేసికొని, దేవతలకు నివేదింపక భుజించు మహాపాపులు పాపమునే భుజింతురు కాని యన్నమును భుజింపరు.

ఊర్జో భవంతి భూతాని దేహావన్నస్య సంభవః,
యజ్ఞాచ్చ దేవసంభూతి స్తదుత్పత్తిశ్చ వైధతః. 14

అన్నమునుండి ప్రాణులును, దేవతలవలన నన్నమును, యజ్ఞమువలన దేవతలును, విధిచే యజ్ఞము నేర్పడినవి.

బ్రహ్మణో వైధముత్పన్నం మత్తో బ్రహ్మ సముద్భవమ్,
అతో యజ్ఞేన విశ్వస్మిఁ స్థితం మాం విద్ధి భూమిప. 15

ఓరాజా! బ్రహ్మమునుండి కర్మము, నావలన బ్రహ్మము నేర్పడినవి. ఇందువలన యజ్ఞమునందును విశ్వమునందును నున్నవానినిగ నన్నుఁ దెలియుము.

సంసృతీనాం మహాచక్రం క్రామితవ్యం విచక్షణైః,
స ముధా ప్రీణతే భూపేన్ద్రియక్రీడోఽధమో జనః. 16

ఓరాజా! విజ్ఞానులచే సంసారమహాచక్రములు దాటఁదగినవిగాన వారు దానికై ప్రయత్నించుట యుచితము. ఇంద్రియములతో నాట్లాడునట్టి యధముఁడు వ్యర్థమైన ప్రీతినిఁ బొందుచున్నాఁడు. ఇంద్రియములచే కలుగు సంతృప్తి యశాశ్వతము.

అంతరాత్మని యః ప్రీత ఆత్మారామోఽఖిలప్రియః,
ఆత్మతృప్తో నరో యః స్యాత్తస్యార్థో నైవ విద్యతే. 17

అంతరాత్మయందు బ్రీతినిపొందినవాఁడు ఆత్మారాముఁ డనఁబడును. వానికి సర్వము ప్రియ మగుచున్నది. ఆత్మయందుఁ దృప్తిఁజెందినవానికి పొంద వలసిన ప్రయోజనాంతర మేమియు లేదు.

కార్యాకార్యకృతీనాం స నైవాప్నోతి శుభాశుభే,
కించిదస్య న సాధ్యం స్యాత్సర్వజంతుషు సర్వదా. 18

అట్టి యాత్మారామునకు సత్కార్యముల ననుష్ఠించుటచేఁ గల్గు శుభ ములును, అసత్కార్యముల ననుష్ఠించుటచేఁ గల్గుశుభములును లేవు. సర్వప్రాణుల యందును సర్వకాలములయందును నసాధ్యమయినది కొంచెమైనను వారికి లేదు.

అతోఽసక్తతయా భూప కర్తవ్యం కర్మజంతుభిః,
సక్తోఽగతిమవాప్నోతి మామవాప్నోతి తాదృశః. 19

ఓరాజా! ఇందువలన సమస్తప్రాణులును ఫలాపేక్షలేక కర్మల నాచ రింపవలయును. ఫలాపేక్షతో కర్మల నాచరించువానికి నుత్తమగతి లభింపదు. ఫలాపేక్షలేక కర్మ నాచరించినవాఁడు నన్ను బొందుచున్నాఁడు.

పరమాం సిద్ధిమాపన్నాః పురా రాజర్షయో ద్విజాః,
సంగ్రహాయ హి లోకానాం తాదృశం కర్మ చాచరేత్. 20

పూర్వము ద్విజులగు రాజర్షులు నిష్కామకర్మాచరణముచేఁ బరమమగు సిద్ధినిఁ బొందిరి. కాన లోకసంగ్రహముకొఱ కెట్టికర్మమునైన నాచరింప వలయును. కాని స్వార్థమునకు నాచరింపరాదు.

శ్రేయాన్యత్కురుతే కర్మ తత్కరోత్యఖిలో జనః,
మనుతే యత్ప్రమాణం స తదేవానుసరత్యసౌ. 21

సత్పురుషుఁడు చేయుకర్మనే సమస్తజనులును చేయుచున్నారు. అతఁడు ప్రమాణముగ దేనినిఁ దలంచునో, దానినే వారును ప్రమాణముగ ననుస రింతురు.

విష్టపే మే నసాధ్యోఽస్తి కచ్చిదర్థో నరాధిప,
అనాలబ్ధశ్చ లబ్ధవ్యః కుర్వే కర్మ తథాప్యహమ్. 22

ఓరాజా! నాలోకమునందు కష్టసాధ్యమగునర్థ మేమియును లేదు. అచ్చట సులభముగఁ బొందఁదగనిదిగూడ పొందఁబడును. అయినను కర్మమును మాత్రము చేయుదును.

న కుర్వేఽహం యథా కర్మ స్వతంత్రోఽలసభావితః,
కరిష్యంతి మమ ధ్యానం సర్వే వర్ణా మహామతే. 23

ఓబుద్ధిమంతుఁడా! నేను స్వతంత్రుఁడనై, సోమరినై కర్మములను చేయనపుడు సమస్తవర్ణస్థులును, నన్నుఁ గూర్చి ధ్యానముఁజేయుదురుగాని కర్మల నాచరింపరు. అందులకై నేను కర్మము నాచరించుచున్నాను.

భవిష్యంతి తతో లోకా ఉచ్ఛిన్నాః సంప్రదాయినః,
హంతా స్యామస్య లోకస్య విధాతా శంకరస్య చ. 24

వైదికసంప్రదాయములతో కూడిన ప్రజలు తమసంప్రదాయముల నుండి భ్రష్టులగుదురు. అట్టితఱి యీప్రపంచమును చక్కఁజేయుటకు మాఱుగ దీనిని సంకరముఁ గావించి నాశముఁ జేసినవాఁడ నయ్యెదను.

కామినో హి సదా కామైరజ్ఞానాత్కర్మకారిణః,
లోకానాం సంగ్రహార్థాయ తద్విద్వాన్ కుర్యాదసక్తధీః. 25

సుఖాభిలాషగలవారు కాములు. వారు ఫలము నపేక్షించి యజ్ఞానమువలన కర్మములనుఁ గావింతురు. బుద్ధిమంతుఁడు ఫలాసక్తిలేక, కవలలోక సంగ్రహమునకై కర్మలను చేయును.

విభిన్నత్వమతిం జహ్యాదజ్ఞానాం కర్మచారిణామ్,
యోగయుక్తః సర్వకర్మాణ్యర్పయేన్మయి కర్మకృత్. 26

అజ్ఞులై ఫలాపేక్షతో కర్మముఁ జేయువారికి భేదబుద్ధియుండును. అట్టిభేదబుద్ధినివదలి యోగముతోఁగూడినవాఁడై కర్మములనుఁ జేయుచు

నాకర్మముల నన్నింటిని నాయం దర్పింపవలయునే గాని దానిఫలమును తా మపేక్షింపరాదు.

అవిద్యాగుణసాచివ్యాత్కుర్వన్కర్మాణ్యతంద్రితః,
అహంకారాద్భిన్నబుద్ధిరహం కర్తేతి యోఽబ్రవీత్. 27

అవిద్యారూపమగు ప్రకృతిసహకారమువలననే మనుష్యుఁడు కర్మములఁ జేయుచున్నాఁడు కాని స్వతంత్రముగ దేనినిఁ జేయుటలేదు. ఇట్లుండ నతఁడు భేదబుద్ధితోఁగూడి యహంకారమువలన తానే కర్త యని చెప్పుకొనుచున్నాఁడు.

యస్తు వేత్త్యాత్మనస్తత్త్వం విభాగాద్గుణకర్మణోః,
కరణం విషయేవృత్తమితి మత్వా న సజ్జతే. 28

గుణకర్మవిభాగముచే నాత్మతత్త్వమును తెలిసినవాఁడు చక్షురాదికరణములే విషయాసక్తములని భావించి తాను నిర్లిప్తుఁడుగ నుండును.

కుర్వంతి సఫలం కర్మ గుణైస్త్రిభిర్విమోహితాః,
అవిశ్వస్తః స్వాత్మద్రుహో విశ్వవిన్నైవ లంఘయేత్. 29

సత్త్వరజస్తమోగుణములచే మోహముఁ బొంది యనఁగా నజ్ఞానులై ఫలాపేక్షతో కర్మములనుఁ జేయుచున్నారు. జ్ఞాని ఇట్లు తమకుతామే ద్రోహముగావించునజ్ఞానులను విశ్వసింపక వర్తింపవలయును. మఱియు కర్మముల నతిక్రమింపరాదు. అనగా ఫలాపేక్షలేక కర్మల నాచరింపవలయును.

నిత్యంనైమిత్తికం తస్మాత్ మయికర్మార్పయేద్బుధః,
త్యక్త్వాహం మమతాబుద్ధిం పరాం గతిమవాప్నుయాత్. 30

జ్ఞాని ఫలాపేక్షలేక తాఁజేయునిత్యకర్మములగు సంధ్యావందనాదులను, నైమిత్తికములగు గ్రహణశ్రాద్ధాదికర్మలను, నాయందే యర్పింపవలయును. అతఁడు అహంకారమమకారములను వదలి పరమపదమునుఁ బొందును.

అనీర్ష్యంతో భక్తిమంతో యే మయోక్తమిదం శుభమ్,
అనుతిష్ఠంతి యే సర్వే ముక్తాస్తేఽఖిలకర్మభిః. 31

ఈర్ష్యను వదలి, భక్తిని వడసి, నాచేఁ జెప్పఁబడిన యీసద్విషయముల నాచరించువారు సమస్తకర్మములనుండి ముక్తులగుచున్నారు.

యేత్వేతదభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్,
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్విద్ధి నష్టానచేతసః.

యేచైవ నానుతిష్ఠంతి త్వశుభాహతచేతసః,
ఈర్ష్యమాణాన్మహామూఢాన్నష్టాంస్తాన్విద్ధి మే రిపూన్.32

శుభములు దొలంగి కల్మషచిత్తులై అసూయగలవారై మహామూఢులై, నాయుపదేశముల ననుష్ఠింపక నాశముఁబొందినవారిని నాశత్రువులుగఁ దెలియుము.

తుల్యం ప్రకృత్యాకురుతే కర్మ యజ్ఞానవానపి,
అనుయాతి చ తామేవాగ్రహస్తత్రముధా మతః. 33

జ్ఞానియు ప్రకృతి ననుసరించియే కర్మనుఁ జేయుచున్నాఁడు. కాన నతఁడును ప్రకృతినే యనుసరించుచున్నాఁడు. కాన కర్మముల నాచరించు విషయమున తానే కర్త యని పట్టుదలనుఁ గల్గియుండుట వ్యర్థము.

కామశ్చైవ తథాక్రోధః ఖానా మర్థేషు జాయతే,
నైతయోర్వశ్యతాం యాయా దస్యవిధ్వంసకౌయతః. 34

చక్షురాదీంద్రియార్థములయిన రూపరసగంధస్పర్శశబ్దములను విషయములయందే, కామక్రోధములుగల్గుచున్నవి. కాని నీకామక్రోధములకు వశ్యుఁడుగ నెన్నటికిని కారాదు. ఇవి మనుష్యుని నాశముచేయునవియై యున్నవి.

శస్తోఽగుణో నిజో ధర్మః సాంగాద న్యస్య ధర్మతః,
నిజే తస్మిన్మృతిః శ్రేయోఽపరత్ర భయదః పరః. 35

స్వధర్మము గుణములేనిదైనను గుణముతోఁగూడిన పరధర్మమునకంటెను శ్రేష్ఠమైనది. తనధర్మమునందు మరణముగూడ శ్రేష్ఠముగాని పరధర్మమునందలి యమృతత్వమైనను భయంకరమయినది.

పుమాన్యత్కురుతే పాపం సహికేన నియుజ్యతే,
అకాంక్షన్నపి హేరంభ! ప్రేరితః ప్రబలాదివ. 36

వరేణ్యుఁడు పలికెను:—ఓ వినాయకా! పురుషుఁడు పాపముఁ జేయఁ గోరికలేనివాఁడుగ నున్నను, దేనిబలమువలననో ప్రేరింపఁబడినట్లు పాపముఁ జేయుచున్నాఁడు. ఇట్లు వానిని పాపమునందు ప్రేరణఁ జేయునది ఏది?

కామక్రోధౌ మహాపాపౌ గుణద్వయసముద్భవౌ,
నయస్తౌ వశ్యతాం లోకాన్ విద్ధ్యేతౌ ద్వేషిణౌ పరౌ. 37

శ్రీవినాయకుఁడు పలికెను:—రజస్తమోగుణములచే నేర్పడు కామ క్రోధములు మహాపాపస్వరూపములై, జనులను తమకు వశ్యులను గావించుకొను చున్నవి. ఇవిరెండును జనులకు పరమశత్రువులని తెలిసికొనుము.

ఆవృణోతియథామాయా జగద్బాష్పోజలం యథా,
వర్షామేఘోయథాభానుం తద్వత్కామోఽఖిలాంశ్చరుట్.

అవిద్యారూపమగు మాయ ప్రపంచము నావరించునట్లు, ఆవిరి యుదకము నావరించునట్లు, వర్షాకాలపుమేఘము సూర్యుని గప్పునట్లు కామము సమస్తగుణములనుఁ గప్పియున్నది.

ప్రతిపత్తిమతో జ్ఞానం ఛాదితం సతతం ద్విషా,
ఇచ్ఛాత్మకేన తరసా దుష్పూర్యేణ చ శుష్మిణా. 39

జ్ఞానియొక్క జ్ఞాన మెల్లప్పుడును, కోరిక యను ఎదిరింప శక్యముగాని, వడిగల బలిష్ఠమగు శత్రువుచే మఱుగుఁజేయఁబడినది.

ఆశ్రిత్యబుద్ధిమనసీ ఇంద్రియాణి స తిష్ఠతి,
తైరేవాచ్ఛాదితప్రజ్ఞో జ్ఞానినం మోహయత్యసౌ. 40

ఆకామము బుద్ధిని, మనస్సును, చక్షురాదీంద్రియములను ఆశ్రయించి యున్నది. అట్టి యింద్రియములచే మనుష్యునియొక్క ప్రజ్ఞను మఱుగుచేసి యున్నది. ఆకామము బ్రహ్మజ్ఞానముగలవానినిగూడ మోహింపఁజేయుచున్నది.

తస్మాన్నియమ్య తాన్యాదౌ సమనాంసి నరో జయేత్,
జ్ఞానవిజ్ఞానయోః శాంతికరం పాపం మనోభవమ్. 41

ఆకారణమువలన మనుష్యుఁడు మనస్సుతోఁగూడిన యాయింద్రియము లను మొదట నిగ్రహించినచో, పిదప జ్ఞానమును విజ్ఞానమును నాశముఁ గావించు మానసికమైనపాపమును జయింపగలఁడు.

యతస్తాని పరాణ్యాహు స్తేభ్యశ్చ పరమం మనః,
తతోఽపి హి పరా బుద్ధిరాత్మా బుద్ధేః పరోమతః. 42

కావనే స్థూలమైనదేహముకంటె నింద్రియము లుత్కృష్టములనియు వానికంటెను మనస్సు ఉత్కృష్టమనియు, దానికంటెను బుద్ధి యుత్కృష్ట మనియు, దానికంటెను ఆత్మ యుత్కృష్టమనియుఁ జెప్పఁబడియున్నది.

బుద్ధ్వైవ మాత్మనాత్మానం సంస్తభ్యాత్మానమాత్మనా,
హత్వాశత్రుంకామరూపం పరంపదమవాప్నుయాత్. 43

ఇవ్విధముగ తనను తానే తెలిసికొని, తనను తానే నిగ్రహించుకొని, కామమనెడి శత్రువును వధించి పరమపదమును పొందవచ్చును.

ఇది శ్రీమద్గణేశగీతయందు కర్మయోగ మను ద్వితీయాధ్యాయము.

---

శ్రీరస్తు

# శ్రీ గ ణే శ గీ త

## తృ తీ యా ధ్యా య ము

---

### విజ్ఞానప్రతిపాదనయోగము

పురా సర్గాదిసమయే త్రైగుణ్యం త్రితనూరుహామ్,
నిర్మాయ చైనమవదం విష్ణవే యోగముత్తమమ్. 1

గజాననుఁడు పలికెను:—పూర్వము సృష్టియొక్క ప్రారంభమునందు సత్త్వరజస్తమస్సులను మూఁడుగుణములను, బ్రహ్మవిష్ణురుద్రులను ముమ్మూర్తులను సృజించి విష్ణువుకొఱకీయుత్తమమయినయోగముఁ జెప్పితిని.

అర్యమ్ణే సోఽబ్రవీత్సోఽపి మనవే నిజసూనవే,
తతః పరంపరాయాతం విదురేనం మహర్షయః. 2

అతఁడు దీనిని సూర్యునికొఱకుపదేశించెను. ఆసూర్యుఁడు తనకుమారుఁడగు మనువుకొఱకు దీని నుపదేశించెను. పిదప వానివంశక్రమముగ వచ్చిన ఈ యోగమును ఋషులు తెలిసికొనిరి.

కాలేన బహునా చాయం నష్టః స్యా చరమే యుగే,
అశ్రద్ధేయోహ్యవిశ్వాస్యో విగీతవ్యశ్చ భూమిప. 3

ఓరాజా! ఇది చివరి యుగమునందు చిరకాలమువఱకు, శ్రద్ధావిశ్వాసములకు విషయముగాక దూషింపఁబడినది.

ఏవం పురాతనం యోగం శ్రుతవానసి మన్ముఖాత్,
గుహ్యాద్గుహ్యతరం వేద రహస్యం పరమం శుభమ్. 4

మిక్కిలి గోప్యమును వేదములచే ప్రతిపాదింపఁబడిన రహస్యమును, సాటిలేనిదియు, మంగళప్రదమునగు నీప్రాచీనమయిన యోగమును నాముఖము నుండి నీవు వింవి.

సాంప్రతం చావతీర్ణోఽసి గర్భతస్త్వం గజానన,
ప్రోక్తవాన్ కథమేతం త్వం విష్ణవే యోగముత్తమమ్. 5

వరేణ్యుఁడు పలికెను:—గజాననా! నీవిప్పుడే గర్భమునుండి వెలుపలికి వచ్చితివి. ఇంతలో నీవెట్లు విష్ణువునకు కీయుత్తమయోగమునుఁ జెప్పితివి.

అనేకాని చ తే జన్మాన్యతీతాని మమాపిచ,
సంస్మరే తాని సర్వాణి న స్మృతిస్తవ వర్తతే. 6

గణేశుఁడు పలికెను:—నీకును, నాకును పెక్కుజన్మములు గడచిపోయి నవి. వానినన్నింటిని నేను స్మరించుచున్నాను. కాని నీకు అట్టి స్మరణములేదు.

మత్తఏవ మహాబాహో జాతా విష్ణ్వాదయః సురాః,
మయ్యేవ చ లయం యాంతి ప్రలయేషు యుగేయుగే. 7

ఓ గొప్పభుజములుగలరాజా! నావలననే విష్ణువు మున్నగు దేవతలు జన్మించిరి. ప్రతియుగమునందు ప్రళయకాలములయందు వారు నాయందే లయించుచున్నారు.

అహమేవ పరో బ్రహ్మా మహారుద్రోఽహమేవ చ,
అహమేవ జగత్సర్వం స్థావరం జంగమం చ యత్. 8

నేనే యుత్కృష్టుఁడగు బ్రహ్మను. నేనే మహారుద్రుఁడను. స్థావర జంగమరూపమగు ప్రపంచమంతయు నేనే.

అజోఽవ్యయోఽహం భూతాత్మాఽనాదిరీశ్వరఏవచ,
ఆస్థాయ త్రిగుణాం మాయాం భవామి బహుయోనిషు. 9

నేను జననమరణములులేనివాఁడను; సమస్తభూతములకు నాత్మనై తనరి యున్నాను. నేను ఆదిలేనివాఁడను. ప్రపంచమును పరిపాలించువాఁడను నేనే.

ఆకల్గినను సత్త్వరజస్తమోగుణములుగల మాయనుఁబొంది నేను పెక్కు యోనుల యందు జన్మించుచున్నాను.

అధర్మోపచయోధర్మాపచయో హి యదా భవేత్,
సాధూన్సంరక్షితుం దుష్టాంస్తాడితుం సంభవామ్యహమ్. 10

ఎప్పుడు అధర్మమునకు వృద్ధియు, ధర్మమునకు క్షయమును గల్గునో, అప్పుడు నేను సాధువులను సంరక్షించుటకు దుష్టులను శిక్షించుటకు జన్మమెత్తు చున్నాను.

ఉచ్ఛిద్యాధర్మనిచయం ధర్మం సంస్థాపయామి చ,
హన్మి దుష్టాంశ్చ దైత్యాంశ్చ నానాలీలాకరో ముదా. 11

అధర్మరాశిని నాశముగావించి ధర్మము నేను నెలకొల్పుచున్నాను. సంతోషముతో పెక్కు లీలలను చేయుచున్నవాఁడనై దుష్టులను, రక్కసులను చంపుచున్నాను.

వర్ణాశ్రమాన్మునీన్సాధూన్ పాలయే బహురూపధృక్,
ఏవం యో వేత్తి సంభూతిర్మమ దివ్యా యుగేయుగే. 12

పెక్కురూపములనుఁ దాల్చిన వాఁడనై, బ్రాహ్మణాదివర్ణములను, బ్రహ్మచర్యాద్యాశ్రమములను కాపాడుచున్నాను. ఇట్లెవ్వఁడు ప్రతియుగము నందును నా యీదివ్యజన్మములఁ దెలిసికొనుచున్నాఁడో.

తత్తత్కర్మ చ వీర్యం చ మమ రూపం సమాసతః,
త్యక్త్వాహం మమతాబుద్ధిమ్ నపునర్భూః స జాయతే. 13

మఱియు నాయద్భుతకార్యములను, నాపరాక్రమమును నాస్వరూపమును విశదముగ నెవ్వఁ డెఱయుచున్నాఁడో; వాఁడు అహంకారమమకారములను వీడి మరల జన్మ మెత్తఁడు.

నిరీహో నిర్భయోఽరోషా మత్పరాః మద్వ్యపాశ్రయాః,
విజ్ఞానతపసా శుద్ధా అనేకే మాముపాగతాః. 14

ఆశలేనివారును, భయములేనివారును, రోషములేనివారును, నాయందే లగ్నమయినవారును, నన్నే నాశ్రమముగ గలిగినవారును, విజ్ఞానసాధకమగు తపముచే పరిశుద్ధులయిన వారునగు పెక్కురు నన్ను పొందిరి.

యేన యేన హి భావేన సంసేవన్తే నరోత్తమాః,
తథా తథా ఫలం తేభ్యః ప్రయచ్ఛామ్యవ్యయం స్ఫుటమ్ 15

ఉత్తములగు మానవులు ఏయేభావముచేత నన్ను సేవింతురో, వారికొఱకు నాశములేనినేను, వారిభావముల కనుగుణములగుఫలములనే యొసంగుచున్నాను. ఇది స్పష్టమయిన విషయము.

జనాః స్వ్యరితరే రాజన్మమ మార్గానుయాయినః,
తథైవ వ్యవహారం తే స్వేషు చాన్యేషు కుర్వతే. 16

రాజా! నామార్గము ననుసరించు నితరజనులును అవ్విధమగువ్యవహారమునే తమవిషయములయందు నితరవిషయములయందును జేయుదురు.

కుర్వంతి దేవతాప్రీతిం కాంక్షంతః కర్మణాం ఫలమ్,
ప్రాప్నువంతీహ తే లోకే శీఘ్రం సిద్ధిం హి కర్మజామ్. 17

తాముఁ జేయుకర్మలకు ఫలముఁగోరి దేవతాప్రీతినిచేయు వారు కొందఱు గలరు. వారీలోకమునందు తాము గావించినకర్మముచేఁ గల్గినసిద్ధిని శీఘ్రముగనే పొందఁగలరు.

చత్వారోహిమయావర్ణా రజఃసత్వతమోంశతః,
కర్మాంశతశ్చసంసృష్టా మృత్యులోకేమయాఽనఘ. 18

పాపములేనివాఁడా! సత్త్వరజస్తమములనెడి గుణములయొక్క భాగములచేతను, వారు ప్రత్యేకముగఁ జేయుకర్మలయొక్క భాగములవలనను భూలోకమున బ్రహ్మక్షత్రియ విట్-శూద్రవర్ణములు నాచే సృజింపఁబడినవి.

కర్తారమపి తేషాం మామకర్తారం విదుర్బుధాః,
అనాదిమీశ్వరం నిత్యమలిప్తం కర్మజైర్గుణైః. 19

వానికి కర్తయైనను, ఆదిలేనటువంటి కర్మవలనఁ గల్గుగుణములచే లిప్తుఁడు కానటువంటి ప్రపంచపరిపాలకుఁ డైనటువంటిశాశ్వతుఁడునై నటువంటి నన్ను కర్తకానివానినిగనే పండితులు తెలిసికొనుచున్నారు.

నిరీహం యోఽభిజానాతి కర్మ బధ్నాతి నైవ తమ్,
చక్రుః కర్మాణి బుద్ధ్యైవం పూర్వం పూర్వం ముముక్షవః. 20

ఎవఁ డిచ్ఛారహితునిగ నన్నుఁ దెలిసికొనుచున్నాఁడో, వానిని కర్మము బంధింపదు. ఈబుద్ధితో మున్నుందు మోక్షముఁ గోరినవారు కర్మములనుఁ జేసిరి.

వాసనాసహితాదాద్యాత్సంసారకారణాద్దృఢాత్,
అజ్ఞానబంధనాజ్జంతుర్ బుద్ధ్వాయం ముచ్యతేఖిలాత్. 21

ప్రాణి వైవిధముగఁ దెలిసికొని, కర్మతోఁగూడినదియు, ఆదియందుండి నదియు, సంసారకారణమైనదియు, దృఢమయినదియు నగునజ్ఞానమనెడి కట్టు త్రాటినుండి విముక్తిఁ బడయుచున్నది.

తదకర్మ చ కర్మాపి కథయామ్యధునా తవ,
యత్ర మౌనం గతా మోహా ద్రుషమో బుద్ధిశాలినః. 22

కాన కర్మము కాని దెద్ది? కర్మమైన దెద్ది? యను విషయము నిప్పుడు నీకుఁ జెప్పుచున్నాను. ఈవిషయమునందు బుద్ధిశాలురగు ఋషులునైత మజ్ఞానముచే నేమియుఁ జెప్పఁజాలక మౌనమును వహించిరి.

తత్త్వం ముముక్షుణా జ్ఞేయం కర్మాకర్మ వికర్మణామ్,
త్రివిధానీహ కర్మాణి సునిమ్నైషాం గతిః ప్రియ. 23

ప్రియమైనవాఁడా! మోక్షముఁ గోరువారు కర్మమనియు, అకర్మమనియు, వికర్మమనియు ముత్తెఱంగులుగల కర్మయొక్కతత్త్వము నరయవలయును. ఈకర్మములయొక్క పోకడ చాల లోఁతైనది. సుబోధమయినది కాదు.

క్రియాయామక్రియాజ్ఞాన మక్రియాయాం క్రియామతిః,
యస్య స్యాత్సహి మర్త్యేస్మిన్ లోకే ముక్తోఽఖిలార్థకృత్ .24

ఎవనికి కర్మమందు "కర్మము కాదు" నెడు బుద్ధియు కర్మభిన్నమైన దానియందు కర్మమనెడిబుద్ధియుఁ గల్గునో, వాఁడే యీమానవలోకమునందు ముక్తుఁడు సమస్తప్రయోజనములను సాధించినవాఁడు నగుచున్నాఁడు.

కర్మాంకురవియోగేన యః కర్మాణ్యాచరేన్నరః,
తత్త్వదర్శననిర్దగ్ధక్రియమాహుర్బుధా బుధమ్. 25

ఏజ్ఞాని జననకారణమగు కర్మమనెడి మొలకనునైతము వీడి నిష్కాముఁడై కర్మ నాచరించుచున్నాఁడో వానిని పండితులు పరమాత్మసాక్షాత్కారముచే దహింపఁబడిన సకలకర్మములు గల్గినవానినిగ వచింతురు.

ఫలతృష్ణాం విహాయ స్యాత్సదా తృప్తో విసాధనః,
ఉద్యుక్తోపి క్రియాం కర్తుం కించిన్నైవ కరోతి సః. 26

ఫలాపేక్షను వదలి సాధనములను వీడి యెల్లప్పుడు తృప్తి ననుభవించు జ్ఞాని కర్మమును జేయ నుద్యుక్తుఁడైనను వాఁడు కొంచెమైనను కర్మము చేసినవాఁడు కానేరఁడు.

నిరీహో నిగృహీతాత్మా పరిత్యక్తపరిగ్రహః,
కేవలం వై గృహం కర్మాచరన్నాయాతి పాతకమ్. 27

ఆశలేనివాఁడును, మనస్సును నిగ్రహించినవాఁడును, సంసారమును వర్జించినవాఁడును నగుజ్ఞాని కర్మము నాచరించుచున్నను పాపమునుఁ బొందనేరఁడు.

అద్వంద్వోఽమత్సరో భూత్వా సిద్ధ్యసిద్ధ్యోః సమశ్చ యః,
యథా ప్రాప్త్యేహ సంతుష్టః కుర్వన్కర్మ న బధ్యతే. 28

సుఖదుఃఖాదులులేనివాఁడుగను, అసూయలేనివాఁడుగనునై, కార్యసిద్ధియందును సముఁడై, లభించినంతమాత్రముచేతనే సంతోష మందుచున్నవాఁడు కర్మమునాచరించియు బంధింపఁబడఁడు.

అఖిలైర్విషయైర్ముక్తో జ్ఞానవిజ్ఞానవానపి,
యజ్ఞార్థం తస్య సకలం కృతం కర్మ విలీయతే. 29

సమస్తవిషయములచేఁ దొలంగినవాఁడును, జ్ఞానవిజ్ఞానములుగలవాఁడు నగు జ్ఞానిచే యజ్ఞమునకై యాచరింపఁబడిన యాతనికర్మమంతయు వానిని బంధింపక నశించుచున్నది.

అహమగ్నిర్హవిర్హోతా హుతం యన్మయి చార్పితమ్,
బ్రహ్మాప్తవ్యం చ తేనాథ బ్రహ్మణ్యేవ యతో రతః. 30

నేనే యగ్నియు, హవిస్సును, హోతయు నగుచున్నాను. నాయం దర్పింపఁబడిన ద్రవ్యము హుతమే (హోమము జేయఁబడినదే) యగుచున్నది. కాన హోమము చేయువారు బ్రహ్మమునం దాసక్తులగుటవలన వానిచే బ్రహ్మమే పొందఁదగినది.

యోగినః కేచిదపరే దిష్టం యజ్ఞం వదంతి చ,
బ్రహ్మాగ్నిరేవ యజ్ఞో వై ఇతి కేచన మేనిరే. 31

కొందఱు యోగులు దైవమునే యజ్ఞమని వచించిరి. ఇతరులు బ్రహ్మాగ్నియే యజ్ఞమని తలంచిరి.

సంయమాగ్నౌ పరే భూప ఇంద్రియాణ్యుపజుహ్వతి,
ఖాగ్నిష్వన్యే తద్విషయాం శ్శబ్దాదీనుపజుహ్వతి. 32

రాజా! ఇతరులు సంయమమనెడు అగ్నియందు ఇంద్రియములను హుతముగావించుచున్నారు. ఇతరులు ఇంద్రియములయందు, ఇంద్రియవిషయము లగు శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములను హుతముఁ గావించుచున్నారు.

ప్రాణానామింద్రియాణాం చ పరే కర్మాణి కృత్స్నశః,
నిజాత్మరతిరూపేగ్నౌ జ్ఞానదీప్తే ప్రజుహ్వతి. 33

ఇతరులు ప్రాణములయొక్కయు నింద్రియములయొక్కయు, సకల కర్మములను, జ్ఞానముచేఁ బ్రజ్వలించు స్వాత్మానందరూపమగు నగ్నియందు వ్రేల్చుచున్నారు.

ద్రవ్యేణ తపసా వాపి స్వాధ్యాయేనాపి కేచన,
తీవ్రవ్రతేన యతినో జ్ఞానేనాపి యజంతి మామ్. 34

కొందఱు నన్ను ద్రవ్యముచేతఁగాని, తపముచేతఁగాని, వేదపాఠముచేతఁగాని తీవ్రవ్రతముచేతఁగాని యర్చించుచున్నారు. యతులు జ్ఞానముచేతను నన్నారాధించుచున్నారు.

ప్రాణేఽపానం తథా ప్రాణ మపానే ప్రక్షిపంతి యే,
రుద్ధ్వా గతీశ్శోభయో స్తే ప్రాణాయామపరాయణాః. 35

ఎవ్వరు ప్రాణవాయువునందు అపానవాయువును, అపానవాయువునందు ప్రాణవాయువును నుంచి, ఆ ప్రాణాపానములయొక్క గమనముల నరికట్టుదురో వారే ప్రాణాయామము గావించువారు.

జిత్వా ప్రాణాన్ప్రాణగతీరుపజుహ్వతి తేషు చ,
ఏవం నానాయజ్ఞరతా యజ్ఞధ్వంసితపాతకాః. 36

ప్రాణములను జయించి యాప్రాణములయందే ప్రాణములయొక్క గతులనువ్రేల్చి, వీనిచే నానాయజ్ఞపరులయిన తత్త్వవేత్తలు, ఆయజ్ఞములచే నశింపఁజేయఁబడిన పాపములుగలవారై యుందురు.

నిత్యం బ్రహ్మ ప్రయాంత్యేతే యజ్ఞశిష్టామృతాశినః,
అయజ్ఞకారిణో లోకో నాయమన్యః కుతో భవేత్. 37

యజ్ఞమున శేషించిన యమృతరూపమగు హవిస్సును భుజించునట్టి వీరు శాశ్వతమగుపరబ్రహ్మమును పొందుచున్నారు. అట్టి యజ్ఞము నాచరించనివానికీలోకమే లేదు. ఇఁక మఱియొకలోకమెట్లుండఁగలదు?

కాయికాదిత్రిధాభూతాన్ యజ్ఞాన్ వేదే ప్రతిష్ఠితాన్,
జ్ఞాత్వా తానఖిలాన్ భూప మోక్ష్యసేఽఖిలబంధనాత్. 38

రాజా! వేదమునందు ప్రతిష్ఠింపఁబడిన కాయికవాచికమానసికములనెడు ముత్తెఱంగులు గల యజ్ఞముల నన్నింటిని దెలిసికొని, సమస్తబంధనములనుండియు విముక్తిఁబడయఁగలవు.

సర్వేషాం భూప యజ్ఞానాం జ్ఞానయజ్ఞః పరో మతః,
అఖిలం లీయతే కర్మ జ్ఞానే మోక్షస్య సాధనే. 39

రాజా! సమస్తయజ్ఞములలోను జ్ఞానయజ్ఞ ముత్కృష్ట మని చెప్పఁబడినది. మోక్షమునకు సాధనమగు జ్ఞానమునందు సమస్తకర్మములు లయించుచున్నవి.

తజ్జ్ఞేయా పురుషవ్యాఘ్ర ప్రశ్నేన నతితః సతామ్,
శుశ్రూషయా వదిష్యంతి సంతస్తత్త్వవిశారదాః. 40

పురుషశ్రేష్ఠా! ఆయజ్ఞము సత్పురుషులను వినయపూర్వకముగ ప్రశ్నించుటవలనఁగాని, వారిశుశ్రూషచేతఁగాని, తెలియఁదగినది. తత్త్వము జక్కఁగ గ్రహించినసాధువు లీవిషయముఁ జెప్పగలరు.

నానాసంగాజ్జనః కుర్వన్నైకం సాధుసమాగమమ్,
కరోతి తేన సంసారే బంధనం సముపైతి సః. 41

ఒక్కసత్సంగము నాచరింపక, నానావిధములగు సంగములను జనము చేయుచున్నది. దానిచే సంసారమునం దదిబంధనముఁ బొందుచున్నది.

సత్సంగాద్గుణసంభూతిరాపదాం లయ ఏవచ,
స్వహితం ప్రాప్యతే సర్వైరిహ లోకే పరత్ర చ. 42

సత్సహవాసమువలన సద్గుణములు సంభవించుచున్నవి. ఆపదలు లయించుచున్నవి. మఱియు నందఱిచేతను నీలోకమునందును పరలోకమునందును హితము పొందఁబడుచున్నది.

ఇతరత్సులభం రాజన్ సత్సంగోఽతీవ దుర్లభః,
యజ్జ్ఞాత్వా న పునర్బంధ మేతి జ్ఞేయం తతస్తతః 43

రాజా! ఇతరమైన దెద్దియైనను సులభమేకాని, సత్సంగముమాత్రము మిక్కిలి దుర్లభమైనది. దేనిని తెలియుటచే మరల సంసారబంధ మేర్పడదో యట్టివిషయము దానిచేఁ దెలియఁబడుచున్నది.

తతః సర్వాణి భూతాని స్వాత్మన్యేవాభిపశ్యతి,
అతిపాపరతో జంతు స్తత స్తస్మాత్ప్రముచ్యతే. 44

అట్టిజ్ఞానమువలన సమస్తప్రాణులను తనయందే చూడఁగలఁడు. మిక్కిలి పాపముచేయు ప్రాణిగూడ నట్టి బ్రహ్మజ్ఞానమువలన నట్టిపాపమునుండి విముక్తిఁబడయును.

ద్వివిధాన్యపి కర్మాణి జ్ఞానాగ్నిర్దహతి క్షణాత్,
ప్రసిద్ధోఽగ్నిర్యథా సర్వం భస్మతాం నయతి క్షణాత్. 45

ప్రసిద్ధమగునగ్ని యెవ్విధముగ నన్నింటిని క్షణమున భస్మముచేయునో యవ్విధముగనే జ్ఞానమనెడి యగ్ని క్షణమున రెండుతెఱంగులుగల కర్మములను దహింపుచున్నది.

న జ్ఞానసమతామేతి పవిత్రమితరన్నృప,
ఆత్మన్యేవావగచ్ఛంతి యోగాత్ కాలేన యోగినః. 46

రాజా! పవిత్రమగు నితరవస్తు వేదియు జ్ఞానమునకు సాటి కానేరదు. యోగముచే కాలక్రమముగ తమయందే తమ్ముఁ దెలిసికొందురు.

భక్తిమానింద్రియజయీ తత్పరో జ్ఞానమాప్నుయాత్,
లబ్ధ్వా తత్పరమం మోక్షం స్వల్పకాలేన యాత్యసౌ 47

భక్తిగలవాఁడును, ఇంద్రియములను జయించినవాఁడును, దానియందే యాసక్తిగలవాఁడు నగు సాధకుఁడు జ్ఞానముఁ బడయుచున్నాఁడు. అట్టి జ్ఞానముఁ బడసి స్వల్పకాలమునందే యద్వితీయమయిన మోక్షముఁ బడయుచున్నాఁడు.

భక్తిహీనోఽశ్రద్ధధానః సర్వత్ర సంశయీ తు యః,
తస్య శం నాపి విజ్ఞానమిహ లోకోఽథవా పరః. 48

భక్తిలేనివాఁడును, శ్రద్ధలేనివాఁడును నంతట సంశయముగలవాఁడు నగుపురుషునికి ఈలోకమునందు శుభమును, విజ్ఞానమును లేవు. పరలోకమును వానికి లేదు.

ఆత్మజ్ఞానరతం జ్ఞాననాశితాఖిలసంశయమ్,
యోగాస్తాఖిలకర్మాణం బధ్నంతి భూప తాని న. 49

రాజా! ఆత్మజ్ఞానముచేతనే రమించువాఁడును, అట్టిజ్ఞానముచే నశింపఁజేయఁబడిన సకలసంశయములుగలవాఁడును, యోగముచే నశించిన సకలకర్మలు గలవాఁడు నగుజ్ఞానిని ఆకర్మములు బంధింపవు.

జ్ఞానఖడ్గప్రహారేణ సంభూతామజ్ఞతాం బలాత్,
ఛిత్త్వాంతః సంశయం తస్మాత్ యోగయుక్తో భవేన్నరః. 50

జ్ఞానమనెడి ఖడ్గముయొక్క వ్రేటుచే, బలాత్కారముగ అజ్ఞానమును ఖండించి, సంశయమునుండి విముక్తుఁడైె మనుష్యుఁడు; యోగముఁ జేపట్ట వలయును.

ఇది శ్రీమద్గణేశగీతయందు విజ్ఞానప్రతిపాదనమను తృతీయాధ్యాయము.



శ్రీ ర స్తు

# శ్రీ గ ణే శ గీ త

## చతుర్థాధ్యాయము



### వైధసన్న్యాసము

సన్న్యస్తిశ్చైవ యోగశ్చ కర్మణాం వర్ణ్యతే త్వయా,
ఉభయోర్నిశ్చితం త్వేకం శ్రేయో యద్వద మే ప్రభో. 1

వరేణ్యుఁడు పలికెను:—కర్మములను త్యజించుట యనియు, కర్మల ననుష్ఠించుట యనియు రెండు తెఱంగులుగా నీచే చెప్పఁబడియున్నది. స్వామీ! ఈ రెంటిలోను శ్రేయస్కరమయిన దేదియో దాని నొక్కటిని నాకుఁ జెప్పుఁడు.

క్రియాయోగో వియోగశ్చాప్యుభౌ మోక్షస్య సాధనే,
తయోర్మధ్యే క్రియాయోగ స్త్యాగాత్తస్య విశిష్యతే. 2

శ్రీగణేశుఁడు పలికెను:—కర్మల నాచరించుటయు, కర్మలను విసర్జించుటయు నను నీరెండును మోక్షమునకు సాధనములే. ఆరెంటిలోను, కర్మాచరణమే కర్మత్యాగమునకంటెను శ్రేష్ఠమై యొప్పుచున్నది.

ద్వంద్వదుఃఖసహోఽద్వేష్టా యో న కాంక్షతి కించన,
ముచ్యతే బంధనాత్సద్యో నిత్యం సన్న్యాసవాన్సుఖమ్. 3

శీతోష్ణాదిద్వంద్వములవలనిదుఃఖముల నోర్చువాఁడును, దేనిని ద్వేషించనివాఁడును, దేనిని కాంక్షించనివాఁడును వెంటనే బంధమునుండి సుఖముగ విముక్తినిఁ బొందుచున్నాఁడు. వాఁడే సన్న్యాసి యనఁబడును.

వదంతి భిన్నఫలకౌ కర్మణస్త్యాగసంగ్రహౌ,
మూఢాల్పజ్ఞాస్తయోరేకం సంయుంజీత విచక్షణః. 4

మూఢులు నల్పజ్ఞులు నగువారు కర్మత్యాగమునకు వేఱైనఫలమందు, కర్మయోగమునకు వేఱైనఫలము వచించుచున్నారు. వివేకి ఆరెంటికి నొక్కఫలమునే గ్రహింపఁగలఁడు.

యదేవ ప్రాప్యతే త్యాగాత్ తదేవ యోగతః ఫలమ్,
సంగ్రహం కర్మణో యోగం యో విదంతి స విందతి. 5

కర్మయోగముచే నేఫలము పొందఁబడునో యాఫలమే కర్మత్యాగము చేతను పొందఁబడుచున్నది. కర్మల నాచరించుట యనుయోగము నెవ్వఁ డాచరించుచున్నాఁడో వాఁడే పరబ్రహ్మముఁ బొందుచున్నాఁడు.

కేవలం కర్మణాం న్యాసం సన్న్యాసం నవిదుర్బుధాః,
కుర్వన్ననిచ్ఛయా కర్మ యోగీ బ్రహ్మైవ జాయతే. 6

కేవలము సన్న్యసించుటను సన్న్యాస మని పండితులు చెప్పరు. నిష్కామముగ కర్మ నాచరించుయోగి పరబ్రహ్మమే యగుచున్నాఁడు.

నిర్మలో యతచిత్తాత్మా జితఖో యోగతత్పరః,
ఆత్మానం సర్వభూతస్థం పశ్యన్ కుర్వన్న లిప్యతే. 7

పరిశుద్ధుఁడును, నిగ్రహింపఁబడిన మనస్సుగలవాఁడును, ఇంద్రియములను జయించినవాఁడును, యోగమునం దాసక్తిగలవాఁడును, సమస్తభూతముల యందును నొక్కయాత్మనే చూచువాఁడు నగుయోగి కర్మను చేయుచున్నను, ఆకర్మఫలముచే నంటఁబడఁడు.

తత్త్వవిద్యోగయుక్తాత్మా కరోమీతి న మన్యతే,
ఏకాదశానీంద్రియాణి కుర్వంతి కర్మసంఖ్యయా. 8

తత్త్వముఁ దెలిసినయోగి తాను కర్మమును చేయుచున్నను, "నేను కర్మమును చేయుచున్నాను" అని తలంపఁడు. కర్మలయొక్క సంఖ్యచే బదునొకండగు నింద్రియములే కర్మములను చేయుచున్నవి.

తత్సర్వమర్పయేద్బ్రహ్మణ్యపి కర్మ కరోతి యః,
న లిప్యతే పుణ్యపాపైర్భానుర్జలగతో యథా. 9

కర్మమునుఁ జేయుయోగికూడ తాఁజేయుకర్మములన్నిటిని బ్రహ్మయందే యర్పింపవలయును. నీటియందలి సూర్యుఁడు నీటియందలి దోషములచే నెట్లంటఁబడఁడో యట్లు పరబ్రహ్మమునందు కర్మముల నర్పించుయోగియుం నాకర్మజన్యములగు పుణ్యపాపములచే నంటఁబడఁడు.

కాయికం వాచికం బౌద్ధమైంద్రియం మానసం తథా,
త్యక్త్వాశాం కర్మ కుర్వంతి యోగజ్ఞాశ్చిత్తశుద్ధయే. 10

యోగులు మనశ్శుద్ధికొఱకు ఫలమునం దాశనువదలి కాయికమగు కర్మము (దేహముచే చేయఁబడు కర్మము) వాచికమగు కర్మము (వాక్కుచేఁ జేయఁబడుకర్మము) బౌద్ధమగు కర్మము (బుద్ధిచేఁ జేయఁబడుకర్మము) ఆచరించుచున్నారు.

యోగహీనో నరః కర్మ ఫలేహాయా కరోత్యలమ్,
బధ్యతే కర్మబీజైః స తతో దుఃఖం సమశ్నుతే. 11

యోగములేనిమానవుఁడు ఫలేచ్ఛతో కర్మము అధికముగ చేయుచున్నాఁడు. అటువంటిమనుష్యుఁడు కర్మబీజములచే బంధింపఁబడును. దానిచే జన్మముల నంది దుఃఖము పొందును.

మనసా సకలం కర్మ త్యక్త్వా యోగీ సుఖం వసేత్,
న కుర్వన్కారయన్వాపి నందఞ్శ్వభ్రే సుప్తనే. 12

మనస్సుచే సకలకర్మములను వర్జించినయోగి సుఖముగ నివసింపవచ్చును. అట్టివాఁడు తాను కర్మముఁ జేయనివాఁడును, ఒరులచేతను గర్మము చేయింపనివాఁడునునై, గుంతయందును పట్టణమందును నేకరీతిగ సంతోషించుచుండును.

న క్రియా నచ కర్తృత్వం కస్యచిత్సృజ్యతే మయా,
న క్రియాబీజసంపర్కః శక్త్యా తత్క్రియతేఽఖిలమ్. 13

నాచే నెవ్వనికిని కర్తృత్వముగాని, క్రియగాని కర్మబీజముతోడి సంబంధముగాని కల్పింపఁబడలేదు. అది యంతయు నాతోఁగూడియుండు ప్రకృతి యనెడిశక్తిచేతనే చేయఁబడుచున్నది.

కస్యచిత్పుణ్యపాపాని న స్పృశామి విభుర్నృప,
జ్ఞానమూఢా విముహ్యంతే మోహేనావృతబుద్ధయః. 14

ఓరాజా! వ్యాపకుఁడనైన నే నెవ్వనియొక్కయు పుణ్యపాపముల నంటను. మోహముచేఁ గూడినబుద్ధిగల, అజ్ఞానులు ఈయంశమున మిక్కిలి మోహము జెందియున్నారు.

వివేకేనాత్మనోఽజ్ఞానం యేషాం నాశితమాత్మనా,
తేషాం వికాసమాయాతి జ్ఞానమాదిత్యవత్పరమ్. 15

ఎవరియొక్కయజ్ఞానము తనయొక్క వివేకముచే తనయంతట నాశముఁ జేయఁబడుచున్నదో, వారియొక్కజ్ఞానము సూర్యునివలె వికాసముఁ బొందుచున్నది.

మన్నిష్ఠా మద్ధియోఽత్యంతం మచ్చిత్తా మయి తత్పరాః,
అపునర్భవమాయాంతి విజ్ఞానాన్నాశితైనసః. 16

నాయందే నిష్ఠయు, నాయందే బుద్ధియు, నాయందే యేకాగ్రమగు మనస్సును, నాయందే యాసక్తియుఁ గలవారు తమవిజ్ఞానముచే నాశముఁ గావింపఁబడిన పాపములుగలవారై పునర్జన్మము నొందరు.

జ్ఞానవిజ్ఞానసంయుక్తే ద్విజే గవి గజాదిషు,
సమేక్షణా మహాత్మానః పండితాః శ్వపచే శుని. 17

జ్ఞానముచేతను, విజ్ఞానముచేతను గూడినద్విజునియందు, గోవునందు, ఏనుఁగు మున్నగువానియందు, చండాలునియందు, శునకమునందు సమముగ నెలయు నొక్కయాత్మనే మహాత్ములగు జ్ఞానులు గాంతురు.

వశ్యాః స్వర్గో జగత్తేషాం జీవన్ముక్తాః సమేక్షణాః,
యతోఽదోషం బ్రహ్మసమం తస్మాత్తేఽపి షయీకృతమ్. 18

అంతట నొక్కపరమాత్మనే చూచుచుండునట్టి జీవన్ముక్తులచే, దోషములేని, అద్వితీయమగు బ్రహ్మము ప్రత్యక్షమునందు విషయీకరింపఁబడుటవలన వారికి స్వర్గమును, ప్రపంచమును వశ్యము లగుచున్నవి.

ప్రియాప్రియే ప్రాప్య హర్షద్వేషౌ యే ప్రాప్నువంతి న,
బ్రహ్మాశ్రితా అసంమూఢా బ్రహ్మజ్ఞాః సమబుద్ధయః. 19

ఎవరు ఇష్టముఁ బడసినపుడు సంతోషమును, అనిష్టముఁబొందినపుడు దుఃఖమును పొందరో; అట్టివారు, మూఢ్యములేనివారై, బ్రహ్మము దెలిసికొనినవారై, అంతటను సమబుద్ధిని నెఱపినవారై పరబ్రహ్మమును బొందుచున్నారు.

కిం సుఖం త్రిషు లోకేషు దేవగంధర్వయోనిషు,
భగవన్కృపయా తన్మే వద విద్యావిశారద. 20

వరేణ్యుఁడు పలికెను:—విద్యలయందు నిపుణుఁడవగు భగవంతుఁడా! ముల్లోకములయందు దేవగంధర్వజన్మములయం దేది సుఖకరము? దయతో దానిని నాకుఁ జెప్పుము.

ఆనందమశ్నుతేఽసక్తః స్వాత్మారామో నిజాత్మని,
అవినాశి సుఖం తద్ధి న సుఖం విషయాదిషు. 21

శ్రీగణేశుఁడు పలికెను:—దేనియందును నాసక్తిలేనివాఁడై తనయందే తనతో క్రీడించువాఁడు ఆనందమును పొందుచున్నాఁడు. అట్టి యానందమే శాశ్వతమయినది. రూపాదివిషయములం దేర్పడు సుఖము లేదా యానందము శాశ్వతమయినది గాదు.

విషయోత్థాని సౌఖ్యాని దుఃఖానాం తాని హేతవః,
ఉత్పత్తినాశయుక్తాని తత్రాసక్తో న తత్త్వవిత్. 22

రూపాదివిషయములచే నేర్పడినసుఖములు దుఃఖములకు కారణములు. ఆసుఖములు ఉత్పత్తితోను నాశముతోను కూడియుండును. అనఁగా ననిత్యములు. వానియందు జ్ఞాని యాసక్తి గల్గియుండఁడు.

కారణే సతి కామస్య క్రోధస్య సహతే చ యః,
తౌ జేతుం వర్ష్మవిరహాత్స సుఖం చిరమశ్నుతే. 23

దేహము లేనందువలన దుర్జయములగు కామక్రోధములకు కారణ మున్నప్పుడును ఎవ్వఁడు సహించుచున్నాఁడో యతఁడు శాశ్వతమయిన సుఖమునుఁ బడయుచున్నాఁడు.

అన్తర్నిష్ఠోఽన్తఃప్రకాశోఽన్తః సుఖోఽన్త రతిర్లభేత్,
అసందిగ్ధోఽక్షయం బ్రహ్మ సర్వభూతహితార్థకృత్. 24

తనలోపల నిష్ఠను, తనలోపల ప్రకాశమును,తనలోపల సుఖమును, తనలోపల నకామమును గల సర్వభూతములకొఱకు హితముచేయుయోగి నిస్సంశయముగ నాశములేనిపరబ్రహ్మమునుఁ బడయుచున్నాఁడు.

జేతారః షడ్రిపూణాం యే శమినో దమిన స్తథా,
తేషాం సమన్తతో బ్రహ్మ స్వాత్మజ్ఞానాం విభాత్యహో.25

కామక్రోధలోభమోహమదమాత్సర్యములను నాఱుశత్రువులను జయించినవారును, శమదమములతో నొప్పువారును, స్వాత్మనుఁ దెలిసికొనినవారును నగు యోగుల కంతట బ్రహ్మము గోచరించుచున్నది. ఇది యాశ్చర్యకరమయిన విషయము.

ఆసనేషు సమాసీన స్త్యక్త్వేమాన్విషయాన్బహిః,
సంస్తభ్య భ్రూకుటీమాస్తే ప్రాణాయామ పరాయణః. 26

బాహ్యములయినరూపాదివిషయములను వదలి సిద్ధాద్యాసనములయందు గూర్చొనినవాఁడై సాధకుఁడు,బొమముడిని నిశ్చలముఁగావించి ప్రాణాయామమునం దాసక్తుఁడై యుండును.

ప్రాణాయామం తు సంరోధం ప్రాణాపానసముద్భవమ్,
వదంతి మునయ స్తం చ త్రిధాభూతం విపశ్చితః. 27

జ్ఞానులయినమునులు ప్రాణాపానములవలన నేర్పడిననిరోధమను (వాయువు నడ్డగించుట) ప్రాణాయామమును మూఁడువిధములుగాఁ జెప్పుచున్నారు.

ప్రమాణం భేదతో విద్ధి లఘుమధ్యమము త్తమమ్,
దశభిర్ద్వ్యధికై ర్వర్ణైః ప్రాణాయామో లఘుః స్మృతః. 28

లఘుప్రాణాయామము, మధ్యమప్రాణాయామము, ఉత్తమ ప్రాణాయామము అను నామూఁడుభేదముల చేతనే వాని మాత్రాకాలారూపమగు పరిమితి నెఱుంగుము. పండ్రెండువర్ణములయొక్క కాలపరిమితిగల ప్రాణాయామము లఘు వనఁబడును.

చతుర్వింశత్యక్షరో యో మధ్యమః స ఉదాహృతః,
షట్ త్రింశల్లఘువర్ణో య ఉత్తమః సోఽభిధీయతే. 29

ఇరువదినాలుగు వర్ణములయొక్క కాలపరిమితిగల ప్రాణాయామము మధ్యమ మనఁబడును. ఇఱువదియాఱు వర్ణములయొక్క కాలపరిమితి గల ప్రాణాయామ ముత్తమ మనఁబడును.

సింహం శార్దూలకం వాపి మత్తేభం మృదుతాం యథా,
నయంతి ప్రాణిన స్తద్వత్ ప్రాణాపానౌ సుసాధయేత్. 30

సింహమునుగాని, పులినిగాని, మదపుటేనుఁగునుగాని జనులు మచ్చికపఱచుకొనునట్లు, సాధకుఁడు ప్రాణాపానములను స్వాధీనపఱచుకొనవలయును.

పీడయంతి మృగాం స్తేన లోకాన్వశ్యంగతా నృప,
దహత్యేన స్తథా వాయుః సంస్తబ్ధో న చ తత్తనుమ్. 31

రాజా! వశ్యములయినమృగములు జనుల నెట్లు పీడింపవో యట్లు, ప్రాణాయామవిధిచే నిశ్చలముగావింపఁబడినవాయువు దేహమును బాధపెట్టక కేవలము పాపమును దహించును.

యథా యథా నరః కశ్చిత్ సోపానవలిమాక్రమేత్,
తథా తథా వశీ కుర్యాత్ ప్రాణాపానౌ హి యోగవిత్.

యోగమును దెలిసినవాఁడు, మనుష్యుఁ డెట్లొక్కొక్క మెట్టుచొప్పున మెట్ల నన్నింటి నెక్కుపవిధమున, ప్రాణాపానములఁ దనవశముఁజేసికొన వలయును.

పూరకం కుంభకం చైవ రేచకం చ తతోఽభ్యసేత్,
అతీతానాగతజ్ఞానీ తతః స్యాజ్జగతీతలే. 33

అందులకై యోగము జేయఁగోరువాఁడు పూరకము (గాలిని పూరించుట) కుంభకము(గాలిని నిలుపుట) రేచకముఁ (గాలిని మెల్లమెల్లగ విడుచుట) అభ్యసింపవలయును. ఇట్లు నాసికచే పూర కుంభక, రేచకవ్యాపార ములతో వాయువును సాధించినయోగి, ప్రపంచమునందు భూతభవిష్యత్కాల యందలి విషయముల దెలిసికొన శక్తిగలవాఁడుగ నేర్పడగలదు.

ప్రాణాయామై ర్ద్వాదశభి రుత్తమైర్ధారణా మతా,
యోగస్తు ధారణే ద్వే స్యాద్యోగీశస్తే సదాభ్యసేత్. 34

ఉత్తమ ప్రాణాయామములను పండ్రెండును చేయుట ధారణ యనఁ బడును. అట్టి రెండుధారణలు యోగ మనఁబడును. యోగీశ్వరుఁ డారెండు ధారణల నభ్యసింపవలయును.

ఏవం యః కురుతే రాజం స్త్రికాలజ్ఞః స జాయతే,
అనాయాసేన తస్య స్యాద్వశ్యం లోకత్రయం నృప. 35

రాజా ! ఇవ్విధముగ నెవ్వఁడు చేయుచున్నాఁడో యతఁడు భూత భవిష్యత్ వర్తమానములను మూడుకాలములఁ దెలిసినవాఁడగును. వానికి పరి శ్రమ లేక ముల్లోకములును వశ్యము లగుచున్నవి.

బ్రహ్మరూపం జగత్సర్వం పశ్యతి స్వాంతరాత్మని,
ఏవం యోగశ్చ సన్న్యాసః సమానఫలదాయినౌ. 36

అతఁడు తన యాత్మయందు సమస్త ప్రపంచమును బ్రహ్మస్వరూపముగ చూచుచున్నాఁడు. ఇట్లు యోగమును, సన్న్యాసమును సమానఫలము నొసంగునవియై యున్నవి.

జంతూనాం హితకర్తారం కర్మణాం ఫలదాయినమ్,
మాం జ్ఞాత్వా ముక్తిమాప్నోతి త్రైలోక్యస్యేశ్వరం విభుమ్.

జంతువులకు మేలుచేయువాఁడను, కర్మములకు ఫలమొసంగువాఁడను, ముల్లోకములకు ప్రభువునై యున్న నన్నుఁ దెలిసికొని ముక్తిని బడయఁగలఁడు.

శ్రీమద్గణేశగీత యందు వైధసన్న్యాస మను చతుర్థాధ్యాయము.

---

శ్రీ ర స్తు

# శ్రీ గ ణే శ గీ త

## పంచమాధ్యాయము

### యోగవృత్తిప్రశంసనము

శ్రౌతస్మార్తాని కర్మాణి ఫలం నేచ్ఛన్సమాచరేత్,
శస్తః సయోగీ రాజేంద్ర అక్రియాద్యోగమాశ్రితాత్. 1

శ్రీ గణేశుఁడు పలికెను:— రాజేంద్రా! శ్రుత్యుక్తములును, స్మృత్యుక్తములు నగుకర్మములను ఫలాపేక్షలేక చేయువాఁడు, వైకర్మముల ననుష్ఠింపక యోగము నవలంబించినయోగికంటెను ప్రశస్తమైనయోగి యనఁదగును.

యోగప్రాప్త్యై మహాబాహో హేతుః కర్మైవమే మతం
సిద్ధియోగస్య సంసిద్ధ్యై హేతు శ్శమదమౌ మతౌ. 2

ఓయిమహాబాహూ! యోగప్రాప్తికొఱకు కర్మయొక్కటియే హేతువని నామతము. సిద్ధియోగమును పొందుటకు శమదమములు రెండును హేతువులుగఁ జెప్పఁబడినవి.

ఇంద్రియార్థాశ్చ సంకల్ప్య కుర్వన్స్వస్య రిపుర్భవేత్,
ఏతాననిచ్ఛన్యః కుర్వన్ సిద్ధిం యోగీ స సిద్ధ్యతి. 3

చక్షురాదీంద్రియముల కర్థములగురూపాదులను సంకల్పించి యోగముఁజేయువాఁడు తనకు తానే శత్రువగును. వానినిఁ గోరక యోగముఁజేయువాఁడు తప్పక సిద్ధిఁబొందఁగలఁడు.

సుహృత్త్వే చ రిపుత్వే చ ఉద్ధారే చైవ బంధనే,
ఆత్మనైవాత్మనో హ్యాత్మా నాత్మా భవతి కశ్చన. 4

ఆత్మకు ఆత్మయే, తనయంతట నేస్తముగను శత్రువుగను, ఉద్ధారకముగను, బంధకముగను నగుచున్నదికాని యాయాత్మ వేఱొకటి కాఁజాలదు.

మానేఽపమానే దుఃఖే చ సుఖే సుహృది సాధుషు,
మిత్రేఽమిత్రేఽప్యుదాసీనే ద్వేష్యే లోష్ఠే చ కాంచనే. 5

సత్కారమునందును, అపమానమునందును, దుఃఖమునందును, సుఖమునందును, శత్రువునందును, సజ్జనులయందును, మిత్రునియందును, అమిత్రునియందును, తటస్థునియందును, ద్వేషింపఁదగినవానియందును, మట్టియందును, బంగారమునందును,

సమో జితాత్మా విజ్ఞానీ జ్ఞానీంద్రియజయావహః,
అభ్యసేత్సతతం యోగం యదాయుక్తతమో హి సః. 6

సమబుద్ధిగలవాఁడై, మనస్సును జయించినవాఁడై, జ్ఞానవిజ్ఞానములుగలవాఁడై, చక్షురాదీంద్రియముల జయించినవాఁడై యెల్లప్పుడును యోగము నభ్యసింపవలయును. అట్టియోగి యుక్తతముఁ డగుచున్నాఁడు.

తప్తః శ్రాంతో వ్యాకులో వా క్షుధితో వ్యగ్రచిత్తకః,
కాలోఽతిశీతేఽత్యుష్ణో వానిలాగ్న్యంబుసమాకులే. 7

యోగమునందును, ధ్యానమునందును నాసక్తిగలయోగి, ఎండచే తాపముఁబొందినవాఁడై, శ్రమఁజెందినవాఁడై, కలతఁజెందినవాఁడై, ఆఁకలిఁ జెందినవాఁడై, విషయాంతరమునందు లగ్నమైనచిత్తముఁగలవాఁడై, మిక్కిలి శీతలమైనకాలమునందును, మిక్కిలి యుష్ణమైనకాలమునందును, గాలిచేతను, అగ్నిచేతను, ఉదకముచేతను కూడిన దేశకాలములయందును,

సధ్వనావతిజీర్ణేగోఃస్థానే సాగ్నౌ జలాంతికే,
కూపకూలే శ్మశానే చ నద్యాం భిత్తౌ చ మర్మరే. 8

ధ్వనితోఁగూడిన ప్రదేశమునందును, మిక్కిలి ప్రాంతఁబడిన ప్రదేశముల యందు గోశాలయందును, అగ్నితోఁగూడిన ప్రదేశమునందును, జలసమీపమునందును, బావిగట్టునందును, శ్మశానమునందును, నదియందును, గోడయందును, మర్మరధ్వనిగలదేశమందును,

చైత్యే సవల్మీకేదేశే పిశాచాదిసమావృతే,
నాభ్యసేద్యోగవిద్యోగం యోగధ్యానపరాయణః. 9

బౌద్ధాలయమునందును, పుట్టలతోఁగూడిన ప్రదేశమునందును, పిశాచములతోఁగూడిన ప్రదేశమునందును, యోగము నభ్యసింపఁగూడదు.

స్మృతిలోపశ్చ మూకత్వం బాధిర్యం మందతా జ్వరః,
జడతా జయతే సద్యో దోషా జ్ఞానాద్ధి యోగినః. 10

దోషములను దెలిసికొనక యోగముఁగావించు యోగికి, స్మరణలోపముఁ (జ్ఞాపకశక్తినశించుట) మూగతనము, చెవిటితనము, మాంద్యము, జ్వరము, జడత్వము వెంటనే కల్గుచున్నవి.

ఏతే దోషాః పరిత్యాజ్యా యోగాభ్యాసన శాలినా,
అనాదరే హి చైతేషాం స్మృతిలోపాదయో ధ్రువమ్. 11

యోగాభ్యాసముచేయువానిచే వెనుకఁ జెప్పఁబడినదోషములు వర్జింపఁదగినవి. వీనిని ఆదరించనియెడల స్మృతిలోపము మున్నగునవి వానికి సంభవించును. ఇది నిక్కము.

నాతిభుంజన్సదా యోగీ నాభుంజన్నాతినిద్రితః,
నాతిజాగ్రత్సిద్ధిమేతి భూపయోగం సదాభ్యసన్. 12

రాజా! యోగి ఎల్లప్పుడు యోగముఁజేయుచు, అతిభోజనమును (మిక్కుటముగ భుజించుటను) అభోజనమును (భోజనమే లేకయుండుటను) అతినిద్రను (అధికముగనిద్రించుటను) అతిజాగరూకతను (ఎక్కువ మేల్కొనియుండుటను) వర్జించినవాఁడై సిద్ధిని బొందఁగలఁడు.

సంకల్ప జాంస్త్యజేత్కామా న్నియతాహార జాగరః,
నియమ్య ఖగణం బుద్ధ్యా విరమేత శనైః శనైః. 13

సాధకుఁడు నియమముతోఁగూడిన యాహారము జాగరణముఁ గల్గినవాఁడై సంకల్పమువలనఁ గల్గుకోరికలను విడువవలయును. ఇంద్రియవర్గమును నిగ్రహించి మెల్లమెల్లగా విశేషముగ నాత్మయం దానందము ననుభవింపవలయును, లేదా సంసారమునుండి విశ్రాంతి ననుభవింపవలయును.

తతస్తతః కృషేదేతద్యత్ర యత్రానుగచ్ఛతి,
ధృత్యాత్మవశగం కుర్యాచ్చిత్తం చంచలమావృతః. 14

మనస్సు తానెచ్చటెచ్చటికిఁ బోవుచుండునో, యచ్చటచ్చటికి మనుష్యుని ఆకర్షించుచున్నది. కాన సాధకుఁడు శ్రద్ధఁగల్గినవాఁడై యట్టి చంచలమైనమనస్సును వశ్యముఁ గావించుకొనవలయును.

ఏవం కుర్వన్సదా యోగీ పరాం నిర్వృతిమిచ్ఛతి,
విశ్వస్మిన్నిజమాత్మానం విశ్వం చ స్వాత్మనీక్షతే. 15

యోగి యిట్లెల్లప్పుడు చేయుచు పరమానందముఁ బొందును మఱియుం ప్రపంచమునందంతట తనయాత్మను, తనయాత్మయందు ప్రపంచమును జూచును.

యోగేన యో మాముపైతి తముపైమ్యహమాదరాత్,
మోచయామి న ముంచామి తమహం మాం స న త్యజేత్.

యోగముతో నెవ్వఁడు నన్నుఁ బొందునో, వానిని నేను ఆదరముతోఁ బొందుచున్నాను. వానిని సంసారబంధమునుండి విముక్తునిఁజేయుదును. మరల వానిని నేను విడువను. వాఁడును నన్ను విడువఁడు.

సుఖే సుఖేతరే ద్వేషే క్షుధితోషే సమస్పృషి,
ఆత్మసామ్యేన భూతాని సర్వగం మాం చ వేత్తి యః. 17

సుఖమునందును, దుఃఖమునందును, ద్వేషమునందును, ఆఁకలియందును, దాహమునందును నేకరీతిగ వర్తించువాఁడై, ప్రాణులను తనయాత్మతో సమాన దృష్టితోను, అంతట వ్యాపించియున్న నన్ను నెవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో,

జీవన్ముక్తః స యోగీంద్రః కేవలం మయి సంగతః,
బ్రహ్మాదీనాం చ దేవానాం స వంద్యః స్యాజ్జగత్త్రయే. 18

అట్టి యోగీంద్రుఁడు, నాకు సంబంధించినవాఁడై జీవన్ముక్తుఁ డగు చున్నాఁడు. అట్టి యోగి ముజ్జగములయందును బ్రహ్మాదిదేవతలను నమస్కరింపఁదగినవాఁడై యుండును.

ద్వివిధోఽపి హి యోగోఽయ మసంభావ్యో హి మే మతః
యతోఽంతఃకరణం దుష్టం చంచలం దుర్గ్రహం విభో. 19

వరేణ్యుఁడు పలికెను—ఓవ్యాపకుఁడా! అంతఃకరణము అనఁగా మనస్సు దోషముతోఁగూడినదియు, చంచలమయినదియు, పట్టసాధ్యముగానిదియు నై యున్నది. అందువలన నీ రెండురకములయిన యోగములును చేయ సాధ్యములు కావని నాయభిప్రాయము.

యో నిగ్రహం దుర్గ్రహస్య మనసః సంప్రకల్పయేత్,
ఘటీయంత్రసమాదస్మా న్ముక్తః సంసృతిచక్రకాత్. 20

శ్రీగజాననుఁడు పలికెను— పట్టశక్యముగాని యీమనస్సు యొక్క నిగ్రహము నెవ్వఁడు చక్కఁగఁజేయునో, యతఁడు నీళ్లచేఁదెడురాట్నముతో సమానమైన సంసారచక్రము నుండి ముక్తిఁబడయగలఁడు.

విషయైః క్రకచై రేతత్ సంసృష్టం చక్రకం దృఢమ్,
జనశ్ఛేత్తుం న శక్నోతి కర్మకీలైః సుసంవృతమ్. 21

రూప రస గంధ స్పర్శ శబ్దరూపవిషయములనెడి అంపములచే దృఢముగ నిర్మింపఁబడినదియు, కర్మమనెడిచీలలచే బంధింపఁబడినదియు నగు నీసంసార చక్రమును లోకము ఛేదింప సమర్థమైనదిగాదు.

అతిదుఃఖం చ వైరాగ్యం భోగాద్వైతృష్ణ్యమేవ చ,
గురుప్రసాదః సత్సంగ ఉపాయాస్తుజ్జయే అమీ. 22

అట్టిసంసారచక్రమును జయించుటయందు; అతిదుఃఖమును, విరక్తియు, విషయముల ననుభవించుటవలన వానియందు నిచ్ఛలేకయుండుటయు, గుర్వనుగ్రహమును, సత్సహవాసము నను నీయవి సాధనములు.

అభ్యాసాద్వా వశీకుర్యాత్ మనో యోగస్య సిద్ధయే,
వరేణ్య! దుర్లభో యోగో వినాస్య మనసో జయాత్. 23

వరేణ్యా! యోగము సిద్ధించుటకొఱకు మనస్సును నభ్యాసముచేతనైనను వశ్యముఁ గావించుకొనవలయును. ఈ మనస్సును జయింపక, యోగము లభింపదు.

యోగభ్రష్టస్య కో లోకః కా గతిః కిం ఫలం భవేత్,
విభో! సర్వజ్ఞ మే ఛింధి సంశయం బుద్ధిచక్రభృత్. 24

వరేణ్యుఁడు పలికెను. ఓవ్యాపకా! సర్వజ్ఞా! యోగమునుండి భ్రష్టుఁడైనవాని కేమిలోకము, ఏమిగతియు, ఏమిఫలమును గల్గును? నా యీసందేహము దీర్పుము.

దివ్యదేహధరో యోగాద్భ్రష్టః స్వర్భోగముత్తమమ్,
భుక్త్వా యోగికులే జన్మ లభేచ్ఛుద్ధిమతాం కులే. 25

శ్రీగణేశుఁడు పలికెను:—యోగభ్రష్టుఁడు దివ్యమయినదేహమును ధరించినవాఁడై ఉత్తమమైన స్వర్లోకభోగము ననుభవించి, యోగులయొక్క వంశమునందుగాని, పరిశుద్ధిగల్గిన పుణ్యవంతులయొక్క వంశమునందుగాని, పరిశుద్ధిగల్గిన పుణ్యవంతులయొక్క వంశమునందుగాని జన్మమెత్తును.

పునర్యోగీ భవత్యేష సంస్కారాత్ పూర్వకర్మజాత్,
న హి పుణ్యకృతాం కశ్చిత్ నరకం ప్రతిపద్యతే. 26

ఓరాజా! ఇట్లు పూర్వజన్మమునందు యోగభ్రష్టుఁడైనపురుషుఁడు పూర్వజన్మమునందలి యోగాభ్యాసమనెడి కర్మమువలనిసంస్కారమువలన మరల యోగి కాఁగలఁడు. పుణ్యముఁజెందినవారిలో నెవ్వఁడును నరకము నొందఁడు.

జ్ఞాననిష్ఠా త్తపోనిష్ఠా త్కర్మనిష్ఠాన్నరాధిప,
శ్రేష్ఠో యోగీ శ్రేష్ఠతమో భక్తిమాన్మయి తేషు యః. 27

ఓరాజా! జ్ఞాననిష్ఠునికంటెను, తపోనిష్ఠునికంటెను, కర్మనిష్ఠునికంటెను, యోగి శ్రేష్ఠుఁడు. నాయందు భక్తిగలవాఁడు వారందఱికంటెను చాలశ్రేష్ఠుఁడు.

ఇది శ్రీమద్గణేశగీతయందు యోగవృత్తిప్రశంసనమను పంచమాధ్యాయము.



శ్రీ ర స్తు

# శ్రీ గ ణే శ గీ త

## షష్ఠాధ్యాయము



ఈదృశం విద్ధి మే తత్త్వం మద్గతేనాంతరాత్మనా,
యజ్జ్ఞాత్వా మామసందిగ్ధం వేత్సి మోక్ష్యసి సర్వగమ్. 1

శ్రీగజాననుఁడు పలికెను:—నాయందే లగ్నమయిన మనస్సుచే నా తత్త్వము నివ్విధముగఁ దెలిసికొనుము. ఈతత్త్వముఁ దెలిసికొనుటచే నీవు సర్వవ్యాపకుఁడనై యున్ననన్ను నిస్సంశయముగఁ దెలిసికొనఁగలవు. దానిచే నీవు సంసారమునుండి విముక్తిఁబడయఁగలవు.

తత్తేఽహం శృణు వక్ష్యామి లోకానాం హితకామ్యయా,
అస్తి జ్ఞేయం యతో నాన్యన్ముక్తేశ్చ సాధనం నృప. 2

ఓరాజా! లోకములకొఱకు మేలెంచి నీకొఱకు దానిని జెప్పఁగలను. వినుము. ముక్తికి దానికంటె నితరమగుసాధన మేదియు దెలియఁదగినది లేదు.

జ్ఞేయా మత్ప్రకృతిః పూర్వం తతః స్యాం జ్ఞానగోచరః,
తతో విజ్ఞానసంపత్తిర్మయి జ్ఞాతే నృణాం భవేత్. 3

మొదట నాయొక్క ప్రకృతి తెలియఁదగినది. పిదపనే నేను జ్ఞానమునకు గోచర మయ్యెదను నేను జ్ఞానమునకుఁ గోచరముకాఁగనే మనుష్యులకు విజ్ఞానసంపద గల్గుచున్నది.

క్ష్మానలౌ ఖమహంకారః కం చిత్తం ధీసమీరణౌ,
రవీందూ యాగకృచ్చైకా దశధా ప్రకృతిర్మమ. 4

భూమియు, అగ్నియు, ఆకాశము, అహంకారమును, ఉదకమును, మనస్సును, బుద్ధియు, వాయువును, సూర్యచంద్రులును, యజమానుడు నను పదునొకండు తెఱంగులుగ నా ప్రకృతి యొప్పుచున్నది.

అన్యాం మత్ప్రకృతిం వృద్ధా మునయః సంగిరంతి చ,
తథా త్రివిష్టపం వ్యాప్తం జీవత్వం గతయానయా. 5

వృద్ధులయినమునులు మఱియొకదానిని గూడ నా ప్రకృతిగ వచించుచున్నారు. జీవత్వముఁబొందిన యా ప్రకృతిచే స్వర్గము లేదా ముల్లోకములును వ్యాప్తిపొందఁబడియున్నవి.

ఆభ్యాముత్పాద్యతే సర్వం చరాచరమయం జగత్,
సంగాద్విశ్వస్య సంభూతిః పరిత్రాణం లయోఽప్యహమ్. 6

ఈ రెండు ప్రకృతులతోను చరాచరరూపమయిన ఈ ప్రపంచమంతయుఁ బుట్టుచున్నది. వానియొక్కసంపర్కమువలననే ప్రపంచమునకుత్పత్తిస్థితిలయములును నేర్పడుచున్నవి.

తత్త్వమేతన్నిబోద్ధుం మే యతతే కశ్చిదేవ హి,
వర్ణాశ్రమవతాం పుంసాం పురా చీర్ణేన కర్మణా. 7

వర్ణాశ్రమధర్మానుష్ఠానపరులలో పూర్వము చేయఁబడిన కర్మవశముచే నొకానొకపురుషుఁడే నాయీతత్త్వముఁ దెలిసికొనుటకుఁ బ్రయత్నించుచున్నాఁడు.

సాక్షాత్కరోతి మాం కశ్చిద్యత్నవత్స్వపి తేషు చ,
మత్తోఽన్యన్నేక్షతే కించిన్మయి సర్వం చ వీక్షతే. 8

అట్లు ప్రయత్నించువారిలో నొకానొకపురుషుఁడే నన్నుఁ జూడఁగలఁడు. అట్టివాఁడు నాకంటె నితరమయిన దానిని దేనినిఁ జూడనేరఁడు. అతఁడు నాయందే సర్వముఁ జూచును.

క్షితౌ సుగంధరూపేణ తేజోరూపేణ చాగ్నిషు,
ప్రభారూపేణ పూష్ణ్యబ్జే రసరూపేణ చాప్సు చ. 9

నేను భూమియందు పరిమళరూపముతోను, అగ్నులయందు తేజోరూపముతోను, సూర్యునియందును చంద్రునియందును వెలుంగుయొక్క రూపముతోను, ఉదకములయందు రసరూపముతోను;

ధీతపోబలినాం చాహం ధీస్తపోబలమేవ చ,
త్రివిధేషు వికారేషు మదుత్పన్నేష్వహం స్థితః. 10

బుద్ధిమంతులయందు బుద్ధిరూపముతోను, తపస్వులయందు తపోరూపముతోను, బలవంతులయందు బలరూపముతోను, నావలన నేర్పడిన మూఁడు విధములైన సాత్త్విక-రాజస-తామసవికారములయందు మూలకారణముగను నొప్పుచున్నాను.

న మాం విందతి పాపీయాన్ మాయామోహితచేతనః,
త్రివికారా మోహయతి ప్రకృతిర్మే జగత్త్రయమ్. 11

మాయచేత మోహముఁజెందిన చైతన్యముఁగల్గినపాపి నన్నుఁ బొందఁజాలఁడు. సాత్త్విక రాజస తామసములనెడి మూఁడువికారములతోఁగూడిన నాయొక్క ప్రకృతి ముల్లోకములను మోహింపఁజేయుచున్నది.

యో మే తత్త్వం విజానాతి మోహం త్యజతి సోఽఖిలమ్,
అనేకైర్జన్మభిశ్చైవం జ్ఞాత్వా మాం ముచ్యతే తతః. 12

ఎవఁడు నాయొక్క యథార్థస్థితినిఁ దెలిసికొనుచున్నాఁడో, అతఁడు సమస్తమోహమును విడుచుచున్నాఁడు. ఇట్లు పెక్కుజన్మములచే నాస్వరూపముఁ దెలిసికొని పిదప నాతఁడు సంసారముచే విడువఁబడుచున్నాఁడు.

అన్యే నానావిధాన్దేవాన్భజంతే తాన్వ్రజంతి తే,
యథాయథా మతిం కృత్వా భజతే మాం జనోఽఖిలః. 13

ఇతరులు నానావిధములగు దేవతలనుఁ గొల్చుచున్నారు; వారిని వారు పొందుచున్నారు. సకల జనములు నన్నెట్లెట్టు బుద్ధిచే గొలుచుచున్నారో,

తథాతథాఽస్య తం భావం పూరయామ్యహమేవ తమ్,
అహం సర్వం విజానామి మాం న కశ్చిద్విబుద్ధ్యతే. 14

వారిభావము నట్లట్లే నేను పూరించుచున్నాను. నే నందఱినిఁ దెలిసికొనుచున్నాను. న న్నొక్కఁడును దెలిసికొనుటలేదు.

అవ్యక్తం వ్యక్తిమాపన్నం న విదుః కామమోహితాః,
నాహం ప్రకాశతాం యామి అజ్ఞానాం పాపకర్మణామ్. 15

సృష్టికి ముందు స్పష్టముకాని స్వరూపముగలవాఁడును, సృష్టికిఁ బిదప స్పష్టమయిన స్వరూపముఁగలవాఁడును నగు నన్ను, కామముచే మోహముఁ జెందినవారు తెలిసికొనఁజాలరు. పాపకర్మలుగలయజ్ఞానులకు నేను ప్రత్యక్షముఁ గాఁజాలను.

యః స్మృత్వా త్యజతి ప్రాణ మంతే మాం శ్రద్ధయాన్వితః,
స యాత్యపునరావృత్తిం ప్రసాదాన్మమ భూభుజ. 16

ఓరాజా! శ్రద్ధతోఁగూడినవాఁడై యవసానకాలమునం దెవ్వఁడు నన్ను స్మరించి ప్రాణమును విడుచుచున్నాఁడో అతఁడు నాయనుగ్రహము వలన మరల సంసారమునకు వచ్చుట యను పునరావృత్తిలేని మోక్షమునుఁ బొందుచున్నాఁడు.

యం యం దేవం స్మరన్ భక్త్యా త్యజతి స్వం కలేబరమ్,
తత్తత్సాలోక్యమాయాతి తత్తద్భక్త్యా నరాధిప. 17

ఓరాజా భక్తిచే నేయేదేవుని స్మరించుచు తనకళేబరమును విడచుచున్నాఁడో; ఆయాదేవతలయందలి భక్తిచే నాయాదేవతలయొక్క సాలోక్యమును అనఁగా నాయాదేవతలతోఁగూడి నాలోకమునందు నివసించుటఁ బొందుచున్నాఁడు.

అతశ్చాహర్నిశం భూప స్మర్తవ్యోఽనేకరూపవాన్,
సర్వేషామప్యహం గమ్యం స్రోతసామర్ణవో యథా. 18

ఓరాజా! ఇందువలన పెక్కురూపములు గల్గిన నేను రేయింబవలును స్మరింపఁదగినవాఁడను. నదులకు సముద్ర మెట్లు పొందఁదగినదో యిట్లందఱికిని నేను పొందఁదగినవాఁడను.

బ్రహ్మవిష్ణుశివేంద్రాద్యాన్ లోకాన్ప్రాప్య పునః పతేత్,
యో మాముపైత్య సందిగ్ధః పతనం తస్య న క్వచిత్. 19

బ్రహ్మయొక్కయు, విష్ణువుయొక్కయు, శివునియొక్కయు, ఇంద్రాదులయొక్కయు లోకములఁబొందినవారు మరల పతనముఁబొందుచున్నారు. సందేహములులేనివాఁడై నన్నుఁ బొందువానికి పతన మెన్నటికిని లేదు.

అనన్యశరణో యో మాం భక్త్యా భజతి భూమిప
యోగక్షేమౌ చ తస్యాహం సర్వదా ప్రతిపాదయే. 20

ఓరాజా! మఱియొకశరణములేక నన్నెవ్వఁడు భక్తిచేఁ బొందుచున్నాఁడో; వానికి నే నెల్లప్పుడును యోగక్షేమములఁ గల్పించుచున్నాను.

వివిధా గతిరుద్దిష్టా శుక్లా కృష్ణా నృణాం నృప,
ఏకయా పరమం బ్రహ్మ పరయా యాతి సంసృతిమ్. 21

ఓరాజా! మానవులకు, శుక్లమనియు, కృష్ణమనియు రెండుమార్గములు జెప్పఁబడియున్నవి. శుక్ల మనగా తెల్లనిది అనగా పరిశుభ్రమయినది. కృష్ణ మనగా నల్లనిది అనగా పరిశుభ్రము గానిది. వానితో శుక్లమార్గమునఁ బోవువాఁడు పరబ్రహ్మమును, కృష్ణమార్గమునఁ బోవువాఁడు సంసారమునుఁ బొందుచున్నాడు.

ఇతి శ్రీ మద్గణేశగీతయందు బుద్ధియోగ మను షష్ఠాధ్యాయము.

---

శ్రీరస్తు

# శ్రీ గణేశగీత

## సప్తమాధ్యాయము

### ఉపాసనాయోగము

కా శుక్లా గతి?రుద్దిష్టా కా చ కృష్ణా?గజానన !
కిం బ్రహ్మ?సంసృతిః కా? మే వక్తుమర్హస్యనుగ్రహాత్. 1

వరేణ్యుఁడు పలికెను—గజాననా ! శుక్లమార్గ మన నేమి ? కృష్ణమార్గ మననేమి? బ్రహ్మ మన నేమి? సంసార మన నేమి! అనుగ్రహము వలన వీనిని నాకు చెప్పఁదగియున్నావు.

అగ్నిర్జ్యోతిరహః శుక్లా కర్మార్హమయనంగతిః,
చాంద్రం జ్యోతి స్తథా ధూమో రాత్రిశ్చ దక్షిణాయనమ్.

శ్రీగజాననుఁడు పలికెను—అగ్ని యనెడితేజస్సు, పగలు, కర్మానుష్ఠానమునకు యోగ్యమయినయయనము అనగా నుత్తరాయణ మనునివి, శుక్లమార్గ మనఁబడును. చంద్రునితేజస్సు, పొగ, రాత్రి, దక్షిణాయనమను నివి కృష్ణమార్గ మనఁబడును.

కృష్ణే తే బ్రహ్మసంసృత్యో రవాప్తేః కారణం గతీ,
దృశ్యాదృశ్యమిదం సర్వం బ్రహ్మైవేత్యవధారయ. 3

వానిలో శుక్లమార్గము బ్రహ్మప్రాప్తికిని కృష్ణమార్గము సంసారప్రాప్తికిని సాధనములు. దృశ్యము నదృశ్యమునై వెలయు నీ ప్రపంచమంతయుఁ పరబ్రహ్మమనియే నిశ్చయించుకొనుము.

క్షరం పంచాత్మకం విద్ధి తదంతరక్షరం స్మృతమ్,
ఉభాభ్యాం యదతిక్రాంతం శుద్ధం విద్ధి సనాతనమ్. 4

పంచభూతమయమగు దేహము నశించునదియనియు దానియందుండు నాత్మ నశించనిదనియుఁ జెప్పఁబడినది. ఈ రెంటిని మీఱి యనాదియై వెలయు. పరమాత్మను పరిశుద్ధమయినదానినిగఁ దెలిసికొనుము.

అనేకజన్మసంభూతిః సంసృతిః పరికీర్తితా,
సంసృతిం ప్రాప్నువంత్యేతే యే తు మాం గణయంతి న. 5

పెక్కుజన్మములనెత్తుటయే సంసార మని చెప్పఁబడినది. ఎవ్వరు నన్ను లెక్కింపరో వారు అట్టి సంసారముఁ బొందుచున్నారు.

యేమాంసమ్యగుపాసన్తే పరంబ్రహ్మప్రయాంతి తే,
ధ్యానాద్యైరుపచారైర్మాం తథాపంచామృతాదిభిః. 6

ఎవ్వరు ధ్యానము మున్నగు మార్గములతోను, పంచామృతాభిషేకము మున్నగునుపచారములతోను న న్నారాధించుచున్నారో, వారు పరబ్రహ్మముఁ జెందుచున్నారు.

స్నానవస్త్రాద్యలంకార సుగంధ ధూపదీపకైః,
నైవేద్యైః ఫలతాంబూలై ర్దక్షిణాభిశ్చ యోఽర్చయేత్.

ఎవ్వఁడు స్నానముచేతను, వస్త్రాద్యలంకారముల నొసంగుటచేతను, పరిమళముగల ధూపములచేతను, దీపములచేతను నైవేద్యములచేతను ఫలతాంబూలములచేతను, దక్షిణలచేతను నన్నారాధించునో,

భక్త్యైకచేతసా చైవ తస్యేష్టం పూరయామ్యహం,
ఏవం ప్రతిదినం భక్త్యా మద్భక్తో మాం సమర్చయేత్. 8

మఱియు నేకాగ్రచిత్తముకలభక్తిచేతను నన్నారాధించునో, వాని యిష్టమును నేను పూరించుచున్నాను. ఇట్లు నాభక్తుఁడు ప్రతిదినముచు భక్తిచే న న్నారాధింపవలయును.

అథవా మానసీం పూజాం కుర్వీత స్థిరచేతసా,
అథవాఫలపత్రాద్యైః పుష్పమూలజలాదిభిః. 9

లేదా నిశ్చలమగుమనస్సుచే మానసికమగు పూజనైన నాకొఱకుఁ జేయవలయును. లేదా ఫలములు, పత్రములు మున్నగువానితోను, మూలములు, ఉదకములు మున్నగువానితోను,

పూజయేన్మాం ప్రయత్నేన తత్తదిష్టం ఫలం లభేత్,
త్రివిధాస్వపి పూజాసు శ్రేయసీ మానసీ మతా. 10

ప్రయత్నముచే నన్నుఁ బూజింపవలయును. అట్లు నన్నుఁ బూజించువాఁడు వాని కిష్టమగుఫలముఁ బొందును. కాయిక వాచిక మానసికములను మూఁడువిధములగు పూజలలో మానసికపూజయే శ్రేష్ఠమని చెప్పఁబడినది.

సాప్యుత్తమా మతా పూజా నిచ్ఛయా యాకృతా మమ,
బ్రహ్మచారీగృహస్థో వా వానప్రస్థో యతిశ్చ యః. 11

ఫలేచ్ఛలేక నాకై చేయఁబడినపూజ యుత్తమమయినది. బ్రహ్మచారియైనను, గృహస్థుఁడైనను, వానప్రస్థుఁడైనను సన్యాసియైనను,

ఏకాం పూజాం ప్రకుర్వాణో౽ ప్యన్యో వా సిద్ధిమృచ్ఛతి,
మదన్యదేవం యోభక్త్యా ద్విషన్మా మన్యదేవతామ్. 12

మఱియొక్కఁడైనను చెప్పఁబడిన మూఁడురకములయినపూజలలో నొక్కదానినిఁ జేయుచుండినను సిద్ధిం బడయును. ఎవఁడు నన్ను ద్వేషించుచు నాకంటె నితరమగుదేవతను భక్తితోఁ బూజించుచున్నాఁడో,

సోపి మామేవ యజతే పరంత్వవిధితో నృప,
యోహ్యన్యదేవతాం మాం చద్విషన్నాన్యాం సమర్చయేత్.

ఓరాజా! అతఁడును విధానములేకుండ నన్నేఁ బూజించుచున్నాఁడు. ఎవ్వఁ డితరదేవతను నన్ను ద్వేషించుచు బూజించుచున్నాఁడో,

యాతి కల్పసహస్రం స నిరయాన్ దుఃఖభాక్ సదా,
భూతశుద్ధిం విధాయాదౌ ప్రాణానాం స్థాపనం తతః. 14

అతఁడు వేయికల్పములు నరకములనుఁ బొందుచు. మఱియు న్నెల్లప్పుడును దుఃఖము ననుభవించువాఁడగును. (న న్నారాధించుటకు) మొదట భూతశుద్ధినిఁ గావించుకొని పిదప ప్రాణవాయువులను స్థాపించుకొనవలయును.

ఆకృష్య చేతసో వృత్తిం తతో న్యాసముపక్రమేత్,
కృత్వాంతర్మాతృకాన్యాసం బహిశ్చాథ షడంగకమ్. 15

పిదప చిత్తవృత్తిని ఆకర్షించుకొని న్యాసము నారంభింపవలయును. లోపల మాతృకాన్యాసముఁ గావించి పిదప వెలుపల మూలమంత్రము యొక్క షడంగన్యాసముఁ గావింపవలయును.

న్యాసం చ మూలమంత్రస్య తతో ధ్యాత్వా జపేన్మనుమ్,
స్థిరచిత్తో జపేన్మంత్రం యథా గురుముఖాగతమ్. 16

పిదప మంత్రమును జపింపవలయును. నిశ్చలచిత్తుఁడై గురుముఖము నుండి యుపదేశ మెవ్విధముగ నైనదో, యావిధముగనే మంత్రమును జపింపవలయును.

జపం నివేద్య దేవాయ స్తుత్వా స్తోత్రైరనేకధా,
ఏవం మాం యఉపాసీత స లభేన్మోక్షమవ్యయమ్. 17

ఇట్లు జపము నివేదనఁజేసి పెక్కుస్తోత్రములతో ననేకవిధములుగ స్తుతించి, యెవ్వఁడు నన్నారాధించుచున్నాఁడో; అతఁడు శాశ్వతమగు మోక్షముఁ బొందుచున్నాడు.

యఉపాసనయా హీనో ధిఙ్నరో వ్యర్థజన్మభాక్,
యజ్ఞోఽహమౌషధం మంత్రోఽగ్నిరాజ్యం చ హవిష్కృతమ్.

ఉపాసనలేనిమనుష్యుఁడు హీనుఁడు. వానిజన్మము వ్యర్థమైనది. నేను యజ్ఞస్వరూపుఁడను, ఔషధస్వరూపుఁడను, మంత్ర స్వరూపుఁడను, అగ్ని

స్వరూపుఁడను, ఆజ్యస్వరూపుఁడను, హవిస్స్వరూపుఁడను, హోమముఁగావింపఁబడిన ద్రవ్యయొక్క స్వరూపముకలవాఁడను.

ధ్యానం ధ్యేయం స్తుతిః స్తోత్రం నతిర్ భక్తిరుపాసనా,
త్రయీజ్ఞేయం పవిత్రం చ పితామహపితామహః. 19

ధ్యానము, ధ్యానముఁజేయఁదగిన వస్తువు, స్తుతి, స్తోత్రము, నమస్కారము, భక్తి, ఆరాధన, వేదముచేఁ దెలియఁదగిన పవిత్రమగు పరబ్రహ్మము, పితరులకందఱికిని పితామహుఁడును నేనే యగుచున్నాఁడను

ఓంకారః పావనః సాక్షీ ప్రభుర్మిత్రం గతిర్లయః,
ఉత్పత్తిః పోషకో బీజం శరణం వాస ఏవ చ. 20

పవిత్రమగునోంకారమును, సాక్షియు, ప్రభువును, మిత్రమును, గతియు నేనే. భూతములయొక్క యుత్పత్తియు, నాశమును నాస్వరూపములే. భూతములనుఁ బోషించువాఁడను నేనే. భూతములకు లేదా ప్రపంచమునకు విత్తువంటి కారణమును, రక్షకమును, వాసభూమియు నేనే.

అసన్మృత్యుః సదమృత మాత్మా బ్రహ్మాహ మేవ చ,
దానం హోమ స్తపో భక్తిర్ జపః స్వాధ్యాయఏవ చ. 21

నేను మృత్యువులేనివాఁడను; సత్యస్వరూపుఁడను, అమృతస్వరూపుఁడను, ఆత్మయు, పరబ్రహ్మమునై యున్నాను. దానము, హోమము, తపము, భక్తి, జపము, వేదపాఠమును,

యద్యత్కరోతి తత్సర్వం స మే మయి నివేదయేత్,
యోషితోఽథ దురాచారాః పాపాస్త్రైవర్ణికా స్తథా. 22

మున్నగువానిలో దేనినిదేనిని నాభక్తుఁడు చేయుచున్నాఁడో, దానినంతయును నాయందే యర్పింపవలయును. దురాచారులగు స్త్రీలును, పాపులయిన త్రైవర్ణికులును,

మదాశ్రయా విముచ్యంతే కిం మద్భక్తా ద్విజాతయః,
న వినశ్యతి మద్భక్తో జ్ఞాత్వేమా మద్విభూతయః. 23

నన్నాశ్రయించినవారలు విముక్తిఁబొందుచున్నారు. ఇట్లుండ ద్విజులు మున్నగువారు నాయందలిభక్తిచే నేల విముక్తిఁబడయరు? నాభక్తుఁ డీనా విభూతులనుఁ దెలిసికొనినచో నాశనముఁబొందఁడు.

ప్రభవం మే విభూతీశ్చ న దేవా ఋషయో విదుః,
నానావిభూతిభిరహం వ్యాప్య విశ్వం ప్రతిష్ఠితః. 24

నాయొక్కయుత్పత్తిని, విభూతులను దేవర్షులు సైత మెఱుంగరు. నేను పెక్కువిధములగు విభూతులచే ప్రపంచమును వ్యాపించి ప్రతిష్ఠనుఁ బొంది యున్నాను.

యద్యచ్ఛ్రేష్ఠతమం లోకే సా విభూతిర్నిబోధ మే. 25

ఏదేది ప్రపంచమునందు మిక్కిలి శ్రేష్ఠమయినదో, అది యది నా విభూతి యని యెఱుంగుము.

ఇది శ్రీమద్గణేశగీతయందు ఉపాసనాయోగమను సప్తమాధ్యాయము.

---

శ్రీ రస్తు

# శ్రీ గణేశగీత

## అష్టమాధ్యాయము

### విశ్వరూపసందర్శన యోగము

భగవన్నారదో మహ్యం తవ నానావిభూతయః,
ఉక్తవాంస్తా అహం వేద న సర్వాః సోఽపి వేత్తి తాః. 1

వరేణ్యుఁడు పలికెను:—భగవంతుఁడగు నారదుఁడు నానావిధములగు నీయొక్క విభూతులను నాకుఁ జెప్పియున్నాఁడు. వాని నన్నిటిని నేను తెలిసికొనలేదు. ఆనారదుఁడును తెలిసికొనియుండలేదు.

త్వమేవ తత్త్వతః సర్వా వేత్సి తా ద్విరదానన,
నిజరూపమిదానీం మే వ్యాపకం చారు దర్శయ. 2

ఓగజాననా! వానినన్నింటిని యథార్థముగ నీవే తెలిసికొనియున్నావు. ఇప్పుడు సర్వవ్యాపకమై సుందరమై యొప్పు నీ యథార్థమగుస్వరూపము, జూపుము.

ఏకస్మిన్మయి పశ్య త్వం విశ్వమేతచ్చరాచరమ్,
నానాశ్చర్యాణి దివ్యాని పురా దృష్టాని కేనచిత్. 3

శ్రీగజాననుఁడు పలికెను:—నాయొక్కనియందే చరాచరరూపమగు నీప్రపంచమును, పూర్వ మెవ్వనిచేఁ జూడఁబడని నానావిధములయిన దివ్యములగునాశ్చర్యములను, నీవు గాంచుము.

జ్ఞానచక్షురహం తేఽస్య సృజామి స్వప్రభావతః,
కర్మచక్షుః కథం పశ్యేన్మాం విభుం హ్యజమవ్యయమ్. 4

నాయొక్క ప్రభావముచేత నేను నీకు జ్ఞాననేత్రము నొసంగుచున్నాను. వ్యాపకుఁడును, జననమరణములు లేనివాఁడును నైన నన్ను చర్మముచే నిర్మింపఁబడిన నేత్రములుగలవాఁ డెట్లు చూడఁగలఁడు.

తతో రాజా వరేణ్యః స దివ్యచక్షురవైక్షత,
ఈశితుః పరమం రూపం గజాస్యస్య మహాద్భుతమ్. 5

పిదప వరేణ్యప్రభువు దివ్యనేత్రముగలవాఁడై, ప్రపంచపరిపాలకుఁడగు గజాననునియొక్క మహాశ్చర్యకరమును,

అసంఖ్యవక్త్రం లలితమసంఖ్యాంఘ్రికరం మహత్,
అనులిప్తం సుగంధేన దివ్యభూషాంబరస్రజమ్. 6

గణింప శక్యముకానిముఖములును, పాదములును, కరములును గల్గినదియు, మనోహరమైనదియు, గొప్పదియు, పరిమళద్రవ్యములచే నలఁదఁబడినదియు, దివ్యములగు నాభరణములతోను, వస్త్రములతోను, పుష్పమాలలతోను నలంకరింపఁబడినదియు,

అసంఖ్యనయనం కోటిసూర్యరశ్మిధృతాయుధమ్,
తద్వపుష్యేవ త్రయో లోకో దృష్టాస్తేన పృథగ్విధాః. 7

గణింప శక్యముగాని నేత్రముగలదియు, కోటిసూర్యులకిరణముల నీను నదియు నస్త్రశస్త్రయుధములతోఁగూడినదియగు నగు దివ్యరూపముఁ గాంచెను. ఆగజాననుని దేహమందు వేఱు వేఱుగులుగల ముల్లోకములను రాజు గాంచెను.

దృష్ట్వైశ్వర్యం పరం రూపం ప్రణమ్య స నృపోఽబ్రవీత్,
వీక్షేఽహం తవ దేహేఽస్మిన్ దేవానృషిగణాన్ పితౄన్. 8

భగవంతుని యాయుత్కృష్టరూపముఁ గాంచి ప్రణమిల్లి యారాజు పలికెను. (వ్యాపకా!) ఈ నీదేహమందు దేవతలను, ఋషిగణములను, పితరులనుఁ గాంచుచున్నాను.

పాతాలానాం సముద్రాణాం ద్వీపానాం చైవ భూభృతామ్,
మహర్షీణాం స ప్తకం చ నానార్థైః సంకులం విభో. 9

మఱియు పెక్కువస్తువులతో సంకులమయిన పాతాళాదిసప్తలోకములను, సప్తసముద్రములను, సప్తద్వీపములను, సప్తకులపర్వతములనుఁ గాంచుచున్నాను.

భువోంతరిక్షస్వర్గాశ్చ మనుష్యోరగరాక్షసాన్,
బ్రహ్మవిష్ణుమహేశేంద్రాన్ దేవాన్ జంతూననేకథా. 10

మఱియు దానియందు భువర్లోకమును, నంతరిక్షలోకమును, స్వర్గలోకమును, మనుష్యులను, ఉరగులను, రాక్షసులను బ్రహ్మ-విష్ణు-రుద్రేంద్రులను, దేవతలను, పెక్కురకములగు జంతువులనుఁ గాంచుచున్నాను.

అనాద్యనంతం లోకాదిమనంతభుజశీర్షకమ్,
ప్రదీప్తానలసంకాశమప్రమేయం పురాతనమ్. 11

ఆదియు నంతము లేనివానినిగను, లోకములకు కారణమయినవానినిగను, అనంతభుజములు ననంతశిరస్సులుగల్గినవానినిగను, ప్రజ్వలించు నగ్నితో సమానమయినవానినిగను, కొలుచుట శక్యమయినవానినిగను, ప్రాచీనమయినవానిగను,

కిరీటకుండలధరం దుర్నిరీక్ష్యం ముదావహమ్,
ఏతాదృశం చ వీక్షే త్వాం విశాలవక్షసం ప్రభుమ్. 12

కిరీటకుండలములధరించినవానినిగను, చూడ శక్యము గాని వానినిగను, సంతోషముఁగూర్చువానినిగను, విశాలమగు వక్షఃస్థలముగలవానినిగను, లోకముల కన్నింటికిఁ బ్రభువైనవానినిగను నేను నిన్నుఁ జూచుచున్నాను.

సురావిద్యాధరైర్యక్షైః కిన్నరైర్మునిమానుషైః,
నృత్యద్భిరప్సరోభిశ్చ గంధర్వైర్గానతత్పరైః. 13

దేవతలతోను, విద్యాధరులతోను, యక్షులతోను, కిన్నరులతోను, మునులతోను, మనుష్యులతోను, నాట్యముఁజేయు నచ్చరలతోను. గానముఁ జేయు గంధర్వులతోను,

వసురుద్రాదిత్యగణైః సిద్ధైః సాధ్యైశ్చ్యుదా యుతైః,
సేవ్యమానం మహాభక్త్యా వీక్ష్యమాణం సువిస్మితైః. 14

అష్టవసువులును, ఏకాదశరుద్రులును, ద్వాదశాదిత్యులు ననుగణ దేవతలతోను, సంతోషముతోఁగూడిన సిద్ధులతోను, సాధ్యులతోను మహాభక్తితోను, సేవింపఁబడు వానిగను, మహాశ్చర్యముతోఁ జూడఁబడుచున్న వానినిగను నిన్ను నేను గాంచుచున్నాను.

వేత్తారమక్షరం వేద్యం ధర్మగోప్తారమీశ్వరమ్,
పాతాలాని దిశః స్వర్గాన్భువం వ్యాప్యాఖిలం స్థితమ్. 15

సర్వముఁ దెలిసినవానినిగను, నందఱిచేఁ దెలియఁదగినవానినిగను, నాశములేనివానినిగను, ధర్మమును రక్షించువానినిగను, నీశ్వరునిగను, పాతాళాద్యధోలోకములను, స్వర్గాద్యూర్ధ్వలోకములను, దిక్కులను, భూమిని సమస్తమును వ్యాపించియున్నవానినిగను నిన్ను నేను జూచుచున్నాను.

భీతాలోకస్తథాచాహమేవం త్వాంవీక్ష్యరూపిణమ్,
నానాదంష్ట్రాకరాలంచ నానావిద్యావిశారదమ్. 16

పెక్కుకోఱలతో భయంకరుఁడవును, పెక్కువిద్యలయందు నేర్పరియును, రూపవంతుఁడవు నగు నిన్నుఁగాంచి లోకములును, నేనును భయపడితిమి.

ప్రలయానలదీప్తాస్యం జటిలం చ నభఃస్పృశమ్,
దృష్ట్వా గణేశ! తేరూపమహం భ్రాంతఇవాభవమ్. 17

ఓగణేశా! ప్రళయాగ్నిచందమున ప్రజ్వలించుముఖముగలదియు, జడలుగలదియు, ఆకసమునంటునదియు నగు నీరూపముఁ గాంచి నేను భ్రమఁ జెందితిని.

దేవా మనుష్యా నాగాద్యాః ఖలాస్త్వదుదరేశయాః,
నానా యోనిభుజశ్చాంతే త్వయ్యేవ ప్రవిశంతి చ. 18

దేవతలు, మనుష్యులు, నాగులు మున్నగువారును,దుర్జనులును నీయందర మందు శయనించుచున్నవారై, కర్మవశముచే నానాజన్మములెత్తి చివర నిన్నే ప్రవేశించుచున్నారు.

అబ్ధేరుత్పద్యమానాస్తే యథా జీమూతబిందవః,
త్వామింద్రోఽగ్నిర్యమశ్చైవ నిరృతిర్వరుణో మరుత్. 19

సముద్రమునం దుద్భవించిన మేఘోదకములు సముద్రమునే ప్రవేశించువిధముగ పైఁజేర్కొనినవారందఱును నిన్నుఁ బొందుదురు. నీవే ఇంద్రుఁడవు, అగ్నివి, యముఁడవు, నిరృతివి, వరుణుఁడవు, వాయువవు.

గుహ్యకేశస్తథేశానః సోమః సూర్యోఽఖిలం జగత్,
నమామి త్వామతః స్వామిన్ ప్రసాదం కురు మేఽధునా. 20

నీవే కుబేరుఁడవు, శివుఁడవు, సూర్యుఁడవు, చంద్రుఁడవు సమస్త ప్రపంచమును నైయున్నావు. స్వామీ! ఇందువలన నిన్ను నమస్కరింతును. ఇప్పుడు నాకనుగ్రహముఁ గావింపుము.

దర్శయస్వ నిజం రూపం సౌమ్యం యత్పూర్వమీక్షితమ్,
కో వేద లీలాస్తే భూమన్ క్రియమాణా నిజేచ్ఛయా. 21

ఏరూపము ముందు నేఁజూచితినో, అట్టి సౌమ్యమయిన నీరూపముఁ జూపుము. వ్యాపకా! స్వేచ్ఛతో నీవు చేయునట్టిలీలల నెవ రెఱుంగుదురు.

అనుగ్రహాన్మయా దృష్టమైశ్వరం రూపమీదృశమ్,
జ్ఞానచక్షుర్యతో దత్తం ప్రసన్నేన త్వయా మమ. 22

ప్రసన్నుఁడవగు నీవు నాకు జ్ఞానదృష్టియొసంగుటవలన నే నేనిట్టి యీశ్వరునికిసంబంధించిన రూపముఁ జూచితిని.

నేదం రూపం మహాబాహో మమ పశ్యంత్యయోగినః,
సనకాద్యా నారదాద్యాః పశ్యంతి మదనుగ్రహాత్. 23

శ్రీగజాననుఁడు పలికెను:—ఓమహాబాహూ ! యోగులుకానివారు నాయీరూపముఁ జూడఁజాలరు. నాయనుగ్రహమువలననే సనకాదులును నారదాదులును నీరూపమునుఁ జూడగల్గియున్నారు.

చతుర్వేదార్థతత్త్వజ్ఞాశ్చతుః శాస్త్రవిశారదాః,
యజ్ఞదానతపోనిష్ఠా న మే రూపం విదంతి తే. 24

నాల్గువేదములలోని తత్త్వములనెఱింగినవారును, సకలశాస్త్రముల యందు నిపుణులును, యజ్ఞమునందు, దానమందును, తపమునందును, నిష్ఠగల వారును, నాయొక్క రూపముఁ దెలియఁజాలరు.

శక్యోఽహం వీక్షితుం జ్ఞాతుం ప్రవేష్టుం భక్తిభావతః,
త్యజ భీతిం చ మోహం చ పశ్య మాం సౌమ్యరూపిణమ్.

భక్తిభావమువలననే, నేను చూచుటకు, తెలిసికొనుటకును, పొందుటకు సాధ్యుఁడను. భయమును, మోహమును విడువుము. సౌమ్యమగురూపముగల నన్నుఁ జూడుము.

మద్భక్తో మత్పరః సర్వసంగహీనో మదర్థకృత్,
నిష్క్రోధః సర్వభూతేషు సమో మామేతి భూభుజ. 26

ఓరాజా! నాభక్తుఁడు, నాయందే యాసక్తిగలవాఁడై, సకలసంశ ములులేనివాఁడై, నాకై కర్మలనాచరించుచున్నవాఁడై, క్రోధములేనివాఁడై, సర్వభూతములయందు సమదృష్టిగలవాఁడై, నన్నుఁ బొందుచున్నాఁడు.

ఇది శ్రీమద్గణేశగీతయందు విశ్వరూపదర్శనమను సప్తమాధ్యాయము.

శ్రీ ర స్తు

# శ్రీ గ ణే శ గీ త

## నవమాధ్యాయము

### క్షేత్ర క్షేత్రజ్ఞ యోగము

అనన్యభావాస్త్వాం సమ్యఙ్మూర్తిమంతముపాసతే,
యో౽క్షరం పరమం వ్యక్తం తయోః కస్తే మతో౽ధికః. 1

వరేణ్యుఁడు పలికెను:—అన్యదైవములయందు భావములేనివాఁడై విగ్రహముతోఁగూడిన నిన్ను ఒకఁడు ఆరాధించును. మఱియొకఁడు, నాశము లేని యవ్యక్తస్వరూపుఁడైన నిన్ను ఆరాధించును. వారిరువురిలో నెవ్వఁడు నీకధికుఁడు ?

అపి త్వం సర్వవిత్సాక్షీ భూతభావన ఈశ్వరః,
అతస్త్వాం పరిపృచ్ఛామి వద మే కృపయా విభో. 2

ఓవ్యాపకా ! నీవు సర్వముఁ దెలిసినవాఁడవు. సర్వముఁ జూచువాఁడవు. భూతభావనుఁడవు, ఈశ్వరుఁడవు. కాన నిన్నుఁ బ్రశ్నించుచున్నాను. దయతోఁ జెప్పుము.

యో మాం మూర్తిధరం భక్త్యా మద్భక్తః పరిషేవతే,
స మే మాన్యో౽నన్యభక్తిర్నియుజ్య హృదయం మయి. 3

శ్రీగజాననుఁడుపలికెను:—హృదయమును నాయందు నిలిపి, అన్యదేవతలయందు భక్తిలేనివాఁడై, నాయందే భక్తిగలవాఁడై, విగ్రహముఁదాల్చిన నన్నెవ్వఁడు కొలుచుచున్నాఁడో వాఁడును నాకు మాన్యుఁడు.

ఖగణం స్వవశం కృత్వాఽఖిలభూతహితార్థకృత్,
ధ్యేయ మక్షరమవ్యక్తం సర్వశం కూటగం స్థిరమ్. 4

ఇంద్రియవర్గమును తన వశముఁగావించుకొని, సకలప్రాణులకును మేలొనరించుచున్నవాఁడై, ధ్యానముఁజేయఁదగినట్టియు, నాశములేనట్టియు, వ్యక్తముగానట్టియు, వ్యాపకుఁడైనట్టియు, కూటస్థుఁడైనట్టియు, స్థిరుఁడైనట్టియు.

సోఽపి మామేత్యనిర్దేశ్యం మత్పరో య ఉపాసతే,
సంసారసాగరాదస్మా దుద్ధరామి తమప్యహమ్. 5

వర్ణింప శక్యముగానట్టియు నన్ను గొలుచున్నాఁడో, వాఁడును, నన్నే పొందును. వానినిగూడ నీసంసారసముద్రమునుండి యుద్ధరించెదను.

అవ్యక్తోపాసనాదుః ఖమధికం తేన లభ్యతే,
వ్యక్తస్యోపాసనాత్సాధ్యం తదేవావ్యక్తభక్తితః. 6

అవ్యక్తమగునన్ను నారాధించుటచే నధికమగు పరిశ్రమ యనుభవింపఁబడును. విగ్రహములచే వ్యక్తుఁడైననన్నుఁ గొలుచుటవలనఁ బొందఁదగినఫలమే యవ్యక్తమగు నన్నుఁ గొలుచుటచేఁ బొందఁదగియున్నది.

భక్తిశ్చైవాదరశ్చాత్ర కారణం పరమం మతమ్,
సర్వేషాం విదుషాం శ్రేష్ఠో హ్యకించిజ్ఞోఽపి భక్తిమాన్. 7

భక్తియు సాదరము నను నీరెండును నన్నుఁ బొందుటకు ముఖ్యకారణములు. కొంచెమైనను జ్ఞానములేనివాఁడైనను భక్తిమంతుఁడయినచో, నతఁడే విద్వాంసులందఱిలోను శ్రేష్ఠుఁడు.

భజన్భక్త్యా విహీనో యః స చండాలోఽభిధీయతే,
చాండాలోఽపి భజన్ భక్త్యా బ్రహ్మణేభ్యోఽధికో మమ. 8

భక్తిలేక నన్ను సేవించువాఁడు చండాలుఁ డనఁబడును. చండాలుఁడైనను, భక్తితో నన్నుఁ గొలుచుచున్నవాఁడై, బ్రాహ్మణులకంటెను నధికుఁడగుచున్నాఁడు.

శుకాద్యాః సనకాద్యాశ్చ పురా ముక్తా హి భక్తితః,
భక్త్యైవ మామనుప్రాప్తా నారదాద్యాశ్చిరాయుషః. 9

తొల్లి శుకుఁడు మున్నగుమహర్షులును, సనకాదిమహర్షులును భక్తి చేతనే ముక్తులయిరి. చిరాయువుగల నారదాదిమహర్షులుగూడ భక్తిచేతనే నన్నుఁ బొందిరి.

అతో భక్త్యా మయి మనో విధేహి బుద్ధిమేవచ,
భక్త్యా యజస్వ మాం రాజం స్తతో మామేవ యాస్యసి.10

ఓరాజా! ఇందువలన భక్తితో మనస్సును బుద్ధిని నాయం దుంచుము. నన్ను భక్తిచేఁ గొలువుము. పిదప నన్నే పొందఁగలవు.

అసమర్థోఽర్పితుం స్వాంతమేవం మయి నరాధిప,
అభ్యాసేన చ యోగేన తతో గంతుం యతస్వ మామ్.11

ఓరాజా! ఇట్లు నీమనస్సును నాయెడ నుంచుటకు నీవు సమర్థుఁడవు కాకపోయినను, అభ్యాసముతోను, యోగముతోను నన్నుఁ బొందుటకుఁ బ్రయత్నించుము.

తత్రాపి త్వమశక్తిశ్చేత్కురు కర్మ మదర్పణమ్,
మమానుగ్రహతశ్చైవం పరాం నిర్వృత్తిమేష్యసి. 12

దానియందును నీవు శక్తుఁడవుకానిచో నీ వాచరించుకర్మమును నాకొఱ కర్పింపుము నాయనుగ్రహమువలన నీవు పరమానంద మొందఁగలవు.

అథైతదప్యనుష్ఠాతుం న శక్తోఽసి తదా కురు,
ప్రయత్నతః ఫలత్యాగం త్రివిధానాం హి కర్మణామ్. 13

దానినిఁ గావించుటకు నీవు శక్తుఁడవుకానిచో, కాయిక-వాచిక-మానసికము లని మూఁడుతెఱంగులుగల కర్మములయొక్కఫలమును ప్రయత్నముతో పరిత్యజింపుము.

శ్రేయసీ బుద్ధిరావృత్తే స్తతో ధ్యానం పరం మతమ్,
తతోఽఖిలపరిత్యాగ స్తతః శాంతిర్గరీయసీ. 14

అవృత్తిరూపమగుజపముకంటెను బుద్ధి శ్రేష్ఠము. దానికంటెను ధ్యానము శ్రేష్ఠము. దానికంటె సకలమును పరిత్యజించుట శ్రేష్ఠము. దానికంటెను శాంతిఁ బడయుంట శ్రేష్ఠము.

నిరహం మమతాబుద్ధిర ద్వేషః శరణః సమః,
లాభాలాభే సుఖే దుఃఖే మానామానే స మే ప్రియః. 15

అహంకారమును మమకారమును లేనివాఁడును ద్వేషము లేనివాఁడును, పీడితులకు రక్షకుఁడై యుండువాఁడును, లాభమునందును, లాభము లేనియప్పుడును, సుఖమునందును, దుఃఖమునందును, మానమునందును నవమానమునందును నేకరీతిగ నొప్పువాఁడునై యున్నవాఁడు నా కిష్టుఁడు.

యం వీక్ష్య న భయం యాతి జన స్తస్మాన్న చ స్వయమ్,
ఉద్వేగభీః కోపముద్భిరహితో యః స మే ప్రియః. 16

ఎవనినిఁజూచి జనము భయముఁజెందదో, ఏజనముఁజూచి తాను భయముఁజెందఁడో, ఎవ్వఁడు కోపము, సంతోషము భయము లేనివాఁడో, అతఁడే నా కిష్టుఁడు.

రిపౌ మిత్రేఽథ గర్హాయాం స్తుతౌ శోకే సమః సముత్,
మానీ నిశ్చలధీభక్తిరసంగః స చ మే ప్రియః. 17

శత్రునియందును, మిత్రునియందును, నిందయందును, స్తుతియందును సముఁడును, సంతోషియు, మానియు, నిశ్చలమగుజ్ఞానమును, భక్తియుఁగలవాఁడును, నంగము లేనివాఁడునై ఎవ్వఁ డుండునో యతఁడే నా కిష్టుఁడు.

సంశీలయతి యశ్చైన ముపదేశం మయా కృతమ్,
స వంద్యః సర్వ లోకేషు ముక్తాత్మా మే ప్రియః సదా. 18

నాచేఁ గావింపఁబడిన యీయుపదేశము నెవ్వఁ డాచరించునో, వాఁడు సర్వలోకములయందు నమస్కరింపఁదగినవాఁడును, ముక్తుఁడును, నాకు ప్రియుఁడునై యుండును.

అనిష్టాప్తౌ చ న ద్వేష్టిష్ట ప్రాప్తౌ న చ తుష్యతి,
క్షేత్రజ్ఞౌ చ యో వేత్తి స మే ప్రియతమో భవేత్. 19

ఎవ్వఁ డనిష్టమువచ్చినపుడు ద్వేషింపఁడో, ఇష్టమువచ్చినపుడు హర్షింపఁడో, క్షేత్రమును, క్షేత్రజ్ఞుని నెవ్వఁడు తెలిసికొనియున్నాఁడో; అతఁడే నాకు చాల యిష్టమయినవాఁడు.

కిం క్షేత్రం ? కశ్చ తద్వేత్తి ? కిం తజ్జ్ఞానం? గజానన !
ఏతదాచక్ష్వ మహ్యం త్వం పృచ్ఛతే కరుణాం బుధే !. 20

వరేణ్యుఁడు పలికెను:—ఓగజాననా! క్షేత్ర మనఁగా నేమి ? ఎవ్వఁడు దానిని తెలిసినవాఁడు? దానిజ్ఞాన మెట్టిది? దయాసముద్రా! అడుగుచున్న నాకై దీనిని స్పష్టముగాఁ జెప్పుము.

పంచభూతాని తన్మాత్రాః పంచకర్మేంద్రియాణి చ,
అహంకారో మనోబుద్ధిః పంచజ్ఞానేంద్రియాణి చ. 21

శ్రీగజాననుఁడు పలికెను:—పంచభూతములు, పంచతన్మాత్రలు, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, అహంకారము, మనస్సు, బుద్ధి.

ఇచ్ఛాఽవ్యక్తం ధృతిర్ద్వేషౌ సుఖదుఃఖే తథైవ చ,
చేతనాసహితశ్చాయం సమూహః క్షేత్రముచ్యతే. 22

ఇచ్ఛ, అవ్యక్తము, ధృతి, ద్వేషము, సుఖదుఃఖములు, చేతనము అను నీపదార్థములయొక్క సమూహము క్షేత్ర మని చెప్పఁబడుచున్నది.

తజ్జ్ఞం త్వం విద్ధిమాంభూప సర్వాన్తర్యామిణంవిభుమ్,
అయంసమూహోఽహంచాపియజ్జ్ఞానవిషయో నృప. 23

ఓరాజా! నీవు, సర్వాంతర్యామియు, వ్యాపకుఁడును నైయున్ననన్ను ఆక్షేత్రముఁ దెలిసినవానినిగ నరయుము. ఓరాజా! ఈపదార్థములయొక్క సమూహమును, నేనును, ఆక్షేత్రజ్ఞానమునందు గోచరములు.

ఆర్జవం గురుశుశ్రూషా విరక్తిశ్చేంద్రియార్థతః,
శౌచం క్షాంతిరదంభశ్చ జన్మాదిదోషవీక్షణమ్. 24

కౌటిల్యములేకయుండుట, గురుశుశ్రూష, ఇంద్రియార్థములగు రూప-రస-గంధ-స్పర్శ-శబ్దములనుండి విరక్తి, పరిశుద్ధి, ఓర్పు, దంభములేకయుండుట, జననమరణములయందు దోషముఁగాంచుట.

సమదృష్టిర్దృఢాభక్తిరేకాంతిత్వం శమో దమః,
ఏతైర్యచ్చ యుతంజ్ఞానం తజ్జ్ఞానం విద్ధి బాహుజ. 25

ఓరాజా! అంతట నొక్కయాత్మనే గాంచుట, దృఢమైనభక్తి, ఏకాంతముఁగల్గియుండుట, శమము, దమము, అను నీగుణములతోఁగూడినజ్ఞానమే, జ్ఞాన మని తెలియుము.

తజ్జ్ఞానవిషయం రాజన్ బ్రవీమి త్వం శృణుష్వ మే,
యజ్జ్ఞాత్వైతి చ నిర్వాణం ముక్త్వా సంసృతిసాగరమ్. 26

ఓరాజా! ఆజ్ఞానమున విషయమగు దానిఁగూర్చి చెప్పుచున్నాను. దానిని నీవు వినుము. దానినిఁ దెలిసికొని ప్రాణి సంసారసాగరమును విడచి మోక్షముఁ బొందుచున్నది.

యదనాదీంద్రియైర్హీనం గుణభుగ్గుణవర్జితమ్,
అవ్యక్తం సదసద్భిన్న మింద్రియార్థావభాసకమ్. 27

అది యాదిలేనిదియు నింద్రియములులేనిదియు, గుణముల ననుభవించు నదియు, గుణములు లేనిదియు, నవ్యక్తమయినదియు సదసత్తులకంటె వేఱైనదియు ఇంద్రియార్థములగు రూపాదు లజ్ఞానము గల్గించునదియు,

విశ్వభృచ్చాఖిలవ్యాపి త్వేకం నానేవ భాసతే,
బాహ్యాభ్యంతరతః పూర్ణ మసంగం తమసః పరమ్. 23

ప్రపంచమును భరించునదియు, అంతట వ్యాపించునదియు, నొక్కటైనను బెక్కువిధములుగ భాసించునదియు, వెలుపల లోపలఁ బూర్ణమైన దియు, సంగములేనిదియు, తమస్సునకు దూరమయినదియు,

దుర్జ్ఞేయం చాతిసూక్ష్మత్వా ద్దీప్తానామపి భాసకమ్,
జ్ఞేయ మేతాదృశం విద్ధి జ్ఞానగమ్యం పురాతనమ్. 29

మిక్కిలి సూక్ష్మముగ నుండుటవలనఁ దెలియ శక్యముగానిదియు ప్రకాశవంతములగు వస్తువులకునయితము ప్రకాశింపఁజేయునదియు నై, జ్ఞానమునకు విషయమైన పురాతన పదార్థముగ తెలియఁదగియున్నది.

ఏతదేవ పరం బ్రహ్మ జ్ఞేయమాత్మా పరోఽవ్యయః,
గుణాన్ ప్రకృతిజాన్ భుంక్తే పురుషః ప్రకృతేః పరః. 30

ఈనాశములేనియాత్మయే పరబ్రహ్మ యని తెలియఁదగినది. ప్రకృతి కంటె భిన్నమైన యీపురుషుఁడు ప్రకృతివలనఁ గల్గుగుణముల ననుభవించుచున్నాఁడు.

గుణైస్త్రిభిరయం దేహే బధ్నాతి పురుషం దృఢమ్,
యదాప్రకాశః శాంతిశ్చ వృద్ధే సత్త్వం తదాధికమ్. 31

సత్త్వ-రజ-స్తమములను మూఁడు గుణములచే నిది పురుషునిదేహమును దృఢముగ బంధించుచున్నది. ఎప్పుడు జ్ఞానమును, శాంతియు వృద్ధిఁజెందునో అప్పుడు సత్త్వగుణ మధికమగును.

లోభోఽశమః స్పృహారంభః కర్మణాం రజసో గుణః,
మోహోఽప్రవృత్తిశ్చాజ్ఞానం ప్రమాద స్తమసో గుణః. 32

లోభము, శాంతిలేకయుండుట, ఆశతో కర్మములనారంభించుట రజస్సుయొక్క గుణములు, మోహము, ప్రయత్నములేకయుండుట, అజ్ఞానము, ప్రమాదము తమస్సుయొక్క గుణములు.

సత్త్వాధికం సుఖం జ్ఞానం కర్మసంగం రజోఽధికః,
తమోఽధికశ్చ లభతే నిద్రాలస్యం సుఖేతరత్. 33

సత్త్వ మధికముగఁగల్గిన సుఖమును జ్ఞానమును గల్గును. రజస్సు నధికముగ గల్గిన కర్మాసక్తిని, తమస్సు నధికముగఁగల్గిన నిద్రను, అలసత్వమును, దుఃఖ మునుఁ బొందును.

ఏషు త్రిషు ప్రవృద్ధేషు ముక్తిసంసృతి దుర్గతీః,
ప్రయాంతి మానవా రాజం స్తస్మాత్సత్త్వాయుతో భవ. 34

ఈ మూడుగుణములును వృద్ధిఁజెందినచో క్రమముగ మోక్షమును, సంసారమును, నరకమును మానవులు పొందుచున్నారు. అనగా సత్త్వగుణము వృద్ధిఁజెందిన మోక్షము, రజోగుణము వృద్ధిఁజెందిన సంసారము, తమోగుణమువృద్ధిఁజెందిన నరకమును మనుష్యులు పొందుచున్నారు. కాన నోరాజా! నీవు సత్త్వగుణముకలవాఁడవుకమ్ము.

తతశ్చ సర్వభావేన భజ త్వాం మాం నరేశ్వర,
భక్త్యా చావ్యభిచారిణ్యా సర్వత్రైవ చ సంస్థితమ్. 35

ఓనరాధిపా! కాన నీవు సకలభావములతోను, లేదా సత్త్వభావముతోను ఏకాంతభక్తితోను, అంతట వ్యాపించియున్న నన్ను భజింపుము.

అగ్నౌ సూర్యే తథా సోమో యచ్చ తారాసు సంస్థితమ్,
విదుషి బ్రాహ్మణే తేజో విద్ధి తన్మామకం నృప. 36

ఓనృపా! అగ్నియందును, సూర్యునియందును, చంద్రునియందును, నక్షత్రములయందును, జ్ఞానియందును, బ్రాహ్మణునియందును, లేదా జ్ఞానియగు బ్రాహ్మణునియందును నిమిడియున్న తేజస్సును నాదిగ నీవు తెలిసికొనుము.

అహమేవాఖిలం విశ్వం సృజామి విసృజామి చ,
ఔషధీస్తేజసా సర్వా విశ్వం చాప్యాయ యామ్యహమ్. 37

నేనే సమస్తప్రపంచమును సృజించుచున్నాను, మఱియు నాశముఁ గావించుచున్నాను. నా తేజస్సుచే సమస్తములగు నోషధులను, ప్రపంచమును తృప్తిఁ గావించుచున్నాను.

సర్వేంద్రియాణ్యధిష్ఠాయ జాఠరం చ ధనంజయమ్,
భునజ్మి చాఖిలాన్భోగాన్ పుణ్యపాపవివర్జితః. 38

నేను పుణ్యపాపములు లేనివాఁడనై సకలేంద్రియములను జఠరాగ్నిని నధిష్ఠించి, సకలభోగముల ననుభవించుచున్నాను.

అహం విష్ణుశ్చ రుద్రశ్చ బ్రహ్మా గౌరీ గణేశ్వరః,
ఇంద్రాద్యాలోకపాలాశ్చ మమైవాంశ సముద్భవాః. 39

విష్ణువును, రుద్రుఁడును, బ్రహ్మయును, పార్వతియు, గణపతియు నేనే. ఇంద్రాదిలోకపాలకులు నాయంశమునుండియే జన్మించిరి.

యేన యేన హి రూపేణ జనో మాం పర్యుపాసతే,
తథా తథా దర్శయామి తస్మై రూపం సుభక్తితః. 40

ఏయేరూపముచే మంచిభక్తితో జనులు నన్నుఁ గొలుచుచున్నారో యాయారూపములతో నే వారికొఱకు నారూపమును జూపుచున్నాను.

ఇతి క్షేత్రం తథా జ్ఞాతా జ్ఞానం జ్ఞేయం మయేరితమ్,
అఖిలం భూపతే సమ్యగుపపన్నాయ పృచ్ఛతే. 41

ఓరాజా! ఉపపత్తితోఁగూడి చక్కఁగ ప్రశ్నించిన నీకొఱకు నిట్లు క్షేత్రము, జ్ఞాత (తెలిసినవాడు) జ్ఞానము, జ్ఞేయము (తెలియఁదగినది) నాచే జెప్పఁబడినది.

ఇది శ్రీమద్గణేశగీతయందు క్షేత్రక్షేత్రజ్ఞవిచారయోగ మను నవమాధ్యాయము.

శ్రీ ర స్తు

# శ్రీ గ ణే శ గీ త

## దశమాధ్యాయము

### ఉపదేశ ప్రకరణము

దైవ్యాసురీ రాక్షసీ చ ప్రకృతిస్త్రివిధా నృణామ్,
తాసాం ఫలాని చిహ్నాని సంక్షేపాత్తేఽధునా బ్రువే. 1

శ్రీగజాననుఁడు పలికెను:—దైవియనియు, ఆసురియనియు, రాక్షసి యనియు మూడు తెఱంగులగు ప్రకృతులు మనుష్యులకుఁ గలవు. ఆప్రకృతుల యొక్క ఫలములను, చిహ్నములను సంగ్రహముగ నీకుఁ జెప్పెదను.

ఆద్యా సంసాధయేన్ముక్తిం ద్వే పరే బంధనం నృప!,
చిహ్నం బ్రవీమి చాద్యాయాస్తన్మే నిగదతః శృణు. 2

ఓరాజా! ఆప్రకృతులలో మొదటిదగు దైవప్రకృతి మోక్షమును సాధించును. తక్కిన రెండుప్రకృతులును మనుష్యుని సంసారముతో బంధించును. అందు మొదటిప్రకృతియొక్క చిహ్నములను జెప్పెదను వినుము.

అపైశున్యం దయాఽక్రోధోఽచాపల్యం ధృతిరార్జవం,
తేజోఽభయమహింసా చ క్షమా శౌచమమానితా. 3

దౌర్జన్యములేకయుండుట, దయ, కోపములేకయుండుట, చాపల్యము లేకయుండుట, ధైర్యము, కౌటిల్యములేకయుండుట, తేజస్సు, భయములేక యుండుట, భయముఁ దొలగించుట, హింసఁజేయకుండుట, ఓర్పు, పరిశుద్ధి, గర్వములేకయుండుట,

ఇత్యాదిచిహ్నమాద్యాయా ఆసుర్యాః శృణు సాంప్రతమ్,
అతివాదోఽభిమానాశ్చ దర్పో జ్ఞానం సకోపతా. 4

ఇవి మున్నగునవి మొదటిదగు దైవప్రకృతియొక్క చిహ్నములు. ఇప్పుడు ఆసురిప్రకృతియొక్కచిహ్నములను వినుము. అతివాదము, అభిమానము, గర్వము, జ్ఞానము, కోపము.

ఆసుర్యాఏవమాద్యాని చిహ్నాని ప్రకృతేర్నృపః,
నిష్ఠురత్వం మదో మోహోఽహంకారో గర్వఏవ చ. 5

ఇవి మున్నగునవి యాసురప్రకృతియొక్కచిహ్నములు. ఓరాజా! కాఠిన్యము, మదము, మోహము, అహంకారము, గర్వము,

ద్వేషోఽహింసాఽదయా క్రోధఔద్ధత్యం దుర్వినీతతా,
ఆభిచారికకర్తృత్వం క్రూరకర్మరతిస్తథా. 6

ద్వేషము, హింస, దయలేకయుండుట, కోపము, ఔద్ధత్యము, వినయము లేకయుండుట, ఇతరులను నాశముఁజేయుటకై యభిచారకర్మములను జేయుచుండుట, క్రూరకర్మలయం దాసక్తి,

అవిశ్వాసః సతాం వాక్యేఽశుచిత్వం కర్మహీనతా,
నిందకత్వం చ వేదానాం భక్తానామసురా ద్విషామ్. 7

సత్పురుషులయొక్కవాక్యములయందు నమ్మకములేకుండుటయు, శుద్ధిలేకయుండుట, కర్మములఁజేయకుండుట, వేదములను, భక్తులను, దేవతలను, నిందించుట,

మునిశ్రోత్రియవిప్రాణాం తథాస్మృతిపురాణయోః,
పాఖండవాక్యేవిశ్వాసః సంగతిర్మలినాత్మనామ్. 8

మునులను, వైదికులగు బ్రాహ్మణులను, స్మృతులను, పురాణములను నిందించుట, వేదదూషకులగు బౌద్ధాదులయొక్క వచనములయందు విశ్వాసముంచుట, దుష్టులతో సహవాసముచేయుట,

సదంభకర్మకర్తృత్వం స్పృహా చ పరవస్తుషు,
అనేకకామనావత్త్వం సర్వదాఽనృతభాషణమ్. 9

దంభముతోఁ గర్మలనుఁ జేయుట, ఒరులవస్తువులయందు నాశఁగల్గి యుండుట, పెక్కుకోరికలనుఁ గల్గియుండుట, ఎల్లప్పుడు నసత్యముఁ జెప్పుట,

పరోత్కర్షాఽసహిష్ణుత్వం పరకృత్యపరాహతిః,
ఇత్యాద్యా బహవశ్చాన్యే రాక్షస్యాః ప్రకృతేర్గుణాః. 10

పరులయుత్కర్షను సహింపకుండుట, పరులకార్యములఁ జెఱుపుచుండుట ఇవి మున్నగునవియు నింక నితరములగు పెక్కులు రాక్షసప్రకృతియొక్కగుణములు.

పృథివ్యాం స్వర్గలోకే చ పరివృత్య వసంతి తే,
మద్భక్తిరహితా లోకా రాక్షసీం ప్రకృతిం శ్రితాః. 11

నాయెడ భక్తిలేనిజనులు రాక్షసప్రకృతినిఁ బొందినవారై భూమిని, స్వర్గమునుఁ జుట్టి నివసించుచున్నారు.

తామసీం యే శ్రితా రాజన్యాంతి తే రౌరవం ధ్రువమ్,
అనిర్వాచ్యం చ తే దుఃఖం భుంజతే తత్ర సంస్థితాః. 12

ఓరాజా! తామసప్రకృతినిఁ బొందినవారు రౌరవనరకముఁ బొందుచున్నారు. ఇది నిజము. వారానరకమునుండి చెప్పఁదరముగాని దుఃఖము ననుభవించుచున్నారు.

దైవాన్నిఃసృత్య నరకా జ్జాయంతే భువి కుబ్జకాః,
జాత్యంధాః పంగవో దీనా హీనజాతిషు తే నృప. 13

ఓరాజా! దైవవశమువలన నరకమునుండి వెలువడి భూమియందు, మఱుగుజ్జులుగను, పుట్టుగ్రుడ్డులుగను, కుంటివారుగను, దీనులుగును హీనజాతులయందు జన్మించుచున్నారు.

పునః పాపసమాచారా మయ్యభక్తాః పతంతి తే,
ఉత్పతంతి హి మద్భక్తా యాం కాంచిద్యోని మాశ్రితాః.14

నాయందు భక్తిలేనివారై, పాపముఁజేయుచున్నవారై, వారు మరల నరకమునఁ బడుచున్నారు. ఏదియో యొకజన్మమునొంది నాకు భక్తులై యున్నతస్థితికి పోవుచున్నారు.

లభంతే స్వర్గతిం యజ్ఞై రన్యైర్ధర్మైశ్చ భూమిప,
సులభాస్తాః సకామానాం మయి భక్తిః సుదుర్లభా. 15

ఓరాజా! వారు యజ్ఞములచేతను నితర ధర్మములచేతను స్వర్గముఁ బొందుచున్నారు. ఫలాపేక్షగలవారి కట్టి కర్మలచే నట్టిస్వర్గాదిగతలు సులభములు, కాని నాయందు భక్తిమాత్రము మిక్కిలి దుర్లభము.

విమూఢా మోహజాలేన బద్ధాః స్వేన చ కర్మణా,
అహం హంతా అహం కర్తా అహం భోక్తేతి వాదినః. 16

మోహజాలముచే మిక్కిలి మూఢులును, తనకర్మముచే బంధింపఁబడినవారును, "నేనే హంతకుఁడను" "నేనే కర్మను" "నేనే భోక్తను".

అహమేవేశ్వరః శాస్తా అహం వేత్తా అహం సుఖీ,
ఏతాదృశీ మతిర్ నృణామధః పాతయతీహ తాన్. 17

"నేనే పరిపాలకుఁడును" "నేనే శాసించువాఁడను" "నేనే తెలిసినవాఁడను" "నేనే సుఖవంతుఁడను" అని యిటువంటిబుద్ధి యేమనుష్యులకుఁ గలదో యది వారిని క్రిందఁబడవేయుచున్నది.

తస్మాదేతత్సముత్సృజ్య దైవీం ప్రకృతిమాశ్రయ,
భక్తిం కురు మదీయాం త్వమనిశం దృఢచేతసా. 18

కావున నిట్టి ప్రకృతినివదలి దైవప్రకృతినిఁ బొందుము. నీవెల్లప్పుడు దృఢచిత్తముతో నాయందు భక్తిని నెఱపుము.

సాపి భక్తిస్త్రిధా రాజన్! సాత్త్వికీ రాజసీ తరా,
యద్దేవాన్ భజతే భక్త్యా సాత్త్వికీ సా మతా శుభా. 19

ఓరాజా! ఆభక్తియు, సాత్త్వికము, రాజసము, తామస మని ముత్తెఱంగులు గల్గియున్నది. ఏభక్తిచే దేవతలను భజింతురో యది సాత్త్వికభక్తి యనఁబడును.

రాజసీ సా తు విజ్ఞేయా భక్తిర్జన్మమృతిప్రదా,
యద్యక్షాంశ్చైవ రక్షాంసి యజంతే సర్వభావతః. 20

జననమరణముల నొసఁగుభక్తి రాజసభక్తి యని తెలియవలయును. ఏభక్తిచే యక్షులను, రాక్షసులను సమస్తభావములతోను భజింతురో,

వేదేనావిహితం క్రూరం సాహంకారం సదంభకమ్,
భజంతే ప్రేతభూతాదీన్ కర్మ కుర్వంతి కాముకమ్. 21

వేదముచే విధింపఁబడనిదియు, క్రూరమయినదియు, అహంకారముతోఁ గూడినదియు, దంభముతోఁగూడినదియు ఫలము నొసఁగనిదియు, కర్మనుఁ జేయువారును, ప్రేతభూతాదులను భజించువారును,

శోషయంతో నిజం దేహమంతస్థం మాం దృఢాగ్రహాః,
తామస్యేతాదృశీ భక్తిర్నృణాం సా నిరయప్రదా. 22

దృఢమయినపట్టుదలతోఁగూడిన వారై, తమదేహమును, తమదేహములోనుండు నన్నును శోషింపఁజేయువారు నగు మనుష్యులయొక్క భక్తి తామసమయినది. అది వారికి నరక మొసఁగుచున్నది.

కామో లోభస్తథా క్రోధో దంభశ్చత్వార ఇత్యమీ,
మహాద్వారాణి వీచీనాం తస్మాదేతాంస్తు వర్జయేత్. 23

కామము లోభము క్రోధము దంభము అను నీనాల్గును సంసారసాగరతరంగములకు గొప్పద్వారములు కాన నీనాలుగింటిని వర్జింపవలయును.

ఇది శ్రీమద్గణేశగీతయందు ఉపదేశయోగమను దశమాధ్యాయము.

శ్రీ ర స్తు

# శ్రీ గ ణే శ గీ త

## ఏకాదశాధ్యాయము

వస్తువివేకయోగము

తపోఽపి త్రివిధం రాజన్ కాయికాదిప్రభేదతః,
ఋజుతార్జవశౌచాని బ్రహ్మచర్యమహింసనమ్. 1

శ్రీగజాననుఁడు పలికెను:—ఓరాజా! కాయికము, మానసికము-వాచికము మున్నగుభేదములచే తపస్సుగూడ మూఁడుతెఱంగులు గల్గియున్నది. కౌటిల్యములేకయుండుట, పరిశుద్ధి, బ్రహ్మము, హింసఁజేయకుండుట,

గురువిజ్ఞద్విజాతీనాం పూజనం చాసురద్విషమ్,
స్వధర్మపాలనం నిత్యం కాయికం తపఈదృశమ్. 2

గురువులను, పండితులను, ద్విజులను, దేవతలను బూజించుట, నిత్యము తనధర్మము బరిపాలించుకొనుట, యిట్టిది కాయికతప స్సనఁబడును.

మర్మాస్పృక్చప్రియం వాక్యమనుద్వేగంహితమ్ ఋతమ్,
అధీతిర్వేదశాస్త్రాణాం వాచికం తపఈదృశమ్. 3

మర్మములను స్పృశించనిదియు, ప్రియమును, ఉద్వేగముగల్గించునదియు, హితమైనవియు, సత్యమయినదియు నగువచనము; వేదశాస్త్రములను జదువుట, యిట్టివి వాచికతప మనఁబడును.

అంతఃప్రసాదః శాంతత్వం మౌనమింద్రియనిగ్రహః,
నిర్మలాశయతా నిత్యం మానసం తపఈదృశమ్. 4

మనస్సునందు నైర్మల్యము, శాంతి, మౌనము, ఇంద్రియనిగ్రహము, ఎల్లప్పుడు పరిశుద్ధమగుభావములను గల్గియుండుట, మానసికతప స్సనఁబడును.

అకామతః శ్రద్ధయా చ యత్తపః సాత్త్వికం చ తత్,
ఋద్ధ్యైసత్కారపూజార్థం సదంభం రాజసం తపః. 5

ఫలాపేక్షలేక శ్రద్ధతోఁ జేయఁబడినతపస్సు సాత్త్విక మనఁబడును. వృద్ధికొఱకును, సత్కారణముకొఱకును అట్టిపూజకొఱకును, దంభముతోఁ జేయఁబడిన తపస్సు రాజస మనఁబడును.

తదస్థిరం జన్మమృతీ ప్రయచ్ఛతీ న సంశయః,
పరాత్మపీడకం యచ్చ తపస్తామసముచ్యతే. 6

అట్టితపస్సు స్థిరమయినదిగాదు. జననమరణముల నిచ్చుచున్నది. సందేహములేదు. పరులను పీడించుస్వభావముగలతపస్సు తామసతప స్సనఁబడును.

విధివాక్యప్రమాణార్థం సత్పాత్రే దేశకాలతః,
శ్రద్ధయా దీయమానం యద్దానం తత్సాత్త్వికం మతమ్. 7

వేదములోనివిధివాక్యములనుఁ బ్రమాణముఁగావించికొని, సత్పాత్రమునందు, సరియైనకాలమున, సరియైనదేశమున శ్రద్ధతో నీయఁబడినదానము సాత్త్విక మనఁబడును.

ఉపకారం ఫలం వాపి కాంక్షద్భిర్దీయతే నరైః,
క్లేశతో దీయమానం వా భక్త్యా రాజసముచ్యతే. 8

ప్రత్యుపకారమును, ఫలమును గోరినమనుష్యులచే, కష్టముతో భక్తి లేక యీయఁబడుచుండుదానము రాజస మనఁబడుచున్నది.

అకాలదేశతోఽపాత్రేఽవజ్ఞయా దీయతే తు యత్,
అసత్కారాచ్చ యద్దత్తం తద్దానం తామసం స్మృతమ్. 9

అకాలమునందు, అదేశమునందును, అపాత్రమునందును, తిరస్కారముతోను, సత్కారములేకయుఁ నీయఁబడుచుండుదానము తామస మని చెప్పఁబడుచున్నది.

జ్ఞానం చ త్రివిధం రాజన్! శృణుష్వ స్థిరచేతసా,
త్రిధా కర్మ చ కర్తారం బ్రవీమి తే ప్రసంగతః. 10

ఓరాజా! జ్ఞానముగూడ మూఁడువిధములు. నిశ్చలమయినమనస్సుతో వినుము. ప్రసంగవశముచే కర్మమును, కర్తను మూఁడు తెఱఁగులుగ జెప్పుచున్నాను.

నానావిధేషు భూతేషు మామేకం వీక్షతే తు యః,
నాశవత్సు చ నిత్యం మాం తజ్జ్ఞానం సాత్త్వికం నృప. 11

ఓరాజా ! నానావిధములగుభూతములయందు నన్నొక్కనినే ఎవఁడు జూచునో; నశించువస్తువులయందు నిత్యుఁడైన నన్నెవ్వఁడు గాంచునో; అట్టి జ్ఞానము సాత్త్విక మనఁబడును.

తేషు వేత్తి పృథగ్భూతం వివిధం భావమాశ్రితః,
మామవ్యయం చ తజ్జ్ఞానం రాజసం పరికీర్తితమ్. 12

వివిధములగుభావములతోఁగూడినవాఁడై యాభూతములందు నన్ను వేర్వేఱుగ నెవ్వఁడు దెలిసికొనుచున్నాఁడో; మఱియు వానియందు నాశము లేని నన్ను నాశముఁగలవానినిగను నెవ్వఁడు దెలిసికొనుచున్నాఁడో; అట్టి జ్ఞానము రాజసమనఁబడును.

హేతుహీనమసత్యం చ దేహాత్మవిషయం చ యత్,
అసదల్పార్థవిషయం తామసం జ్ఞానముచ్యతే. 13

కారణములులేనిదియు, నసత్యమయినదియు, దేహమేయాత్మ యని గోచరించుకొనునదియు, దోషయుక్తములును నల్పములు నగునర్థములను విషయీకరించుకొనినదియు, నగుజ్ఞానము తామస మనఁబడును.

భేదతస్త్రివిధం కర్మ విద్ధి రాజన్మయేరితమ్,
కామనాద్వేషదంభైర్యద్రహితం నిత్యకర్మ యత్. 14

ఓరాజా! చెప్పఁబడినభేదములచే కర్మయు ముత్తెఱఁగులుగ్గలినదని నాచేఁ జెప్పఁబడినది. కానఁ దెలిసికొనుము. కోరిక, ద్వేషము, దంభము లేనిదియు, నిత్యముఁ జేయవలసినదియు,

కృతం వినా ఫలేచ్ఛాం యత్ కర్మ సాత్త్వికముచ్యతే,
యద్బహుక్లేశతః కర్మ కృతం యిచ్ఛ ఫలేచ్ఛయా. 15

ఫలాపేక్షలేక జేయఁబడినదియునగు, కర్మ సాత్త్వికమని చెప్పఁబడుచున్నది. ఏది చాలకష్టముచే చేయదగినదో ఏది ఫలేచ్ఛచే ననుష్ఠింపఁబడినదో,

క్రియమాణం నృభిర్దంభాత్ కర్మ రాజసముచ్యతే,
అనపేక్ష్య స్వశక్తిం యదర్థ క్షయకరం చ యత్. 16

మఱియు నేది దంభమువలన మనుష్యులచేఁ జేయఁబడుచున్నదో యట్టికర్మ రాజస మనఁబడును. తన శక్తినిమించినదియు, ధనమును వ్యయముఁగావించునదియుఁ,

అజ్ఞానాత్క్రియమాణం యత్కర్మ తామసమీరితం,
కర్తారం త్రివిధం విద్ధి కథ్యమానం మయా నృప. 17

అజ్ఞానమువలనఁ జేయఁబడుచున్నదియు, నగుకర్మ తామస మనఁబడును. నాచేఁ జెప్పఁబడుప్రకారము కర్తను మూఁడుతెఱఁగులుగ నీ వరయుము.

ధైర్యోత్సాహీ సమోఽసిద్ధౌ సిద్ధౌ చావిక్రియస్తు యః,
అహంకార విముక్తోయః స కర్తా సాత్త్వికో నృప. 18

ఓరాజా! ధైర్యోత్సాహములుగలవాఁడును, కార్యము సిద్ధించినను సిద్ధింపకపోయినను నొక్కతీరుగ నుండువాఁడును, వికారములేనివాఁడును, లేదా అంతట సముఁడును, కార్యము సిద్ధించినను సిద్ధింపఁబోయినను వికారము జెందనివాఁడును, అహంకారముచే విడువఁబడినవాఁడును నగుకర్త సాత్త్వికుఁడనఁబడును.

కుర్వన్ హర్షం చ శోకం చ హింసాం ఫలస్పృహాం చ యః,
అశుచిర్ లుబ్ధకోయశ్చ రాజసోఽసౌ నిగద్యతే. 19

సంతోషమును, దుఃఖమును, హింసను, ఫలాపేక్షను నెవ్వఁడు చేయుచు, నశుచియు లోభియు నైయుండునో యట్టికర్త రాజసుఁ డనఁబడును.

ప్రమాదాజ్ఞాన సహితః పరోచ్ఛేదపరః శఠః,
అలసస్తర్కవాన్యస్తు కర్తాసౌ తామసో మతః. 20

ప్రమాదముతోను నజ్ఞానముతోనుఁగూడినవాఁడును, పరులను నాశముఁ జేయుటయం దాసక్తిగలవాఁడును, దుష్టుఁడును, అంసుఁడును, వాదించువాఁడు నగుకర్త తామసుఁ డనఁబడును.

సుఖం చ త్రివిధం రాజన్ దుఃఖం చ క్రమతః శృణు,
సాత్త్వికం రాజసం చైవ తామసం చ మయోచ్యతే. 21

ఓరాజా! సుఖమును దుఃఖమును, సాత్త్వికము, రాజసము, తామసము నని ముత్తెఱంగులై యున్నవి అవి నాచేఁ జెప్పఁబడును. క్రమముగా వినుము.

విషవద్భాసతే పూర్వం దుఃఖస్యాంతకరం చ యత్,
ఇష్యమాణం తథా వృత్త్యా యదంతేఽమృతవద్భవేత్. 22

మొదట విషమువలె భాసించునదియు, దుఃఖమును తుదముట్టించు నదియు నభ్యాసవశముచేఁ గోరఁబడునదియు, తనబుద్ధియొక్క నైర్మల్యము వలన చివర నమృతమువలెఁ బరిణమించునదియు,

ప్రసాదాత్స్వస్య బుద్ధేర్యత్సాత్త్వికం సుఖమీరితమ్,
విషయాణాంతుయోభోగో భాస తేఽమృత వత్పురా. 23

సుఖము సాత్త్విక మనఁబడుచున్నది. మొదట నమృతమువలె భాసించు నదియు చివర హాలాహలవిషమువలెఁ బరిణమించునదియు నగు విషయ భోగము,

హాలాహల మివాంతేయ ద్రాజసంసుఖమీరితం,
తన్ద్రిప్రమాదసంభూతమాలస్యప్రభవం చ యత్. 24

రాజస మనఁబడుచున్నది. కునుకుపాటుచేతను, ప్రమాదముచేతనుఁ గల్గినదియు, సోమరితనముచేఁ బుట్టినదియు,

సర్వదా మోహకం స్వస్య సుఖం తామసమీదృశమ్,
న తదస్తి యదేతైర్యన్ ముక్తం స్యాత్త్రివిధైర్గుణైః. 25

